

కైలాసనాథాలయము (ఎల్లోరా)

ఫొటో : నందగోపాల్.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

Founder
K. Nageswara Rao

స్థాపితము
1908

★

సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపుటము 55
సంచిక 35

11-5-60
బుధవారం

శార్వరి వైశాఖ బహుళ పూర్ణిమ

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి
మదరాసు-1.

ముఖచిత్రం:

సుఖీభవా ప్రొడక్షన్స్ వారి
'భక్తశబరి'లో
పండరీబాయి



అనివార్య కారణాలవల్ల ఈ వారం రాజధాని కబుర్లు ప్రచురించడం జరగలేదు.

---

తెలుగు వెలుగులు శీర్షిక క్రింద కొండా వెంకట రంగారెడ్డిగార్ని గూర్చి ప్రచురించినవ్యాసము చాల బాగున్నది. ఉన్నదున్నట్లు చక్కని విమర్శనాభావంతో వ్రాసినందుకు చాల సంతోషం. ఈ శీర్షిక క్రింద ప్రచురించిన వ్యాసములలో నా దృష్టి నాకర్షించిన వాటిలో ఇది మూడవది.

ధరణి (హైదరాబాదు).

* *

"రెడ్డిగారు రాజకీయాలలో రాతుకులు, కార్యంలో చాణక్యులు, యుక్తిలో యుగంధరులు" ఈ మూడు ముక్కలు చాలు వారి ప్రతిభను వ్యక్తము చేయడానికి.

వేదుల సత్యనారాయణ మూర్తి (కాజీపేట.)

* *

"తెలుగు వెలుగులు" శీర్షికను ప్రతి వారం చదువుతుంటాను. అందులో రెండు మూడు లోపాలు బలంగా కనుపిస్తున్నాయి.

1. అపహాస్యంతో కూడిన వాక్యాలు: శ్రీ కొండా వెంకటరంగారెడ్డగార్ని గూర్చి వ్రాస్తూ "కనుకనే తెలంగాణా ప్రజల హక్కులకు భంగం ...... అని వీరు అడపా తడపా నినాదాలుచేయడం నిలుపరు" అన్నారు.

2. అప్రస్తుతమైన వివరాలివ్వడం. పై వ్యాసంలోనే "ఉగాది బిరుదావళిలో తమ పేరు కనుపించనందుకు వీరు నొచ్చుకుని మరునటిదినం తమ పేరుతో బాటు అనుబంధ బిరుదావళి ప్రకటించేవరకు కునుకు తీయలేదు" అన్నారు. దీని తర్వాతి వాక్యం ఇంకా వ్యంగ్యంగా వున్నది.

ఇదివరలో రంగా, విశ్వనాథంగార్లనుగూర్చిన వ్యాసాలలో అసందర్భమైన చర్చ చాల చేశాడు రచయిత. ఈయన్ని హేళనను చూస్తే వ్రాతగా భావిస్తున్నాడా అనిపిస్తుంది.

టి. సూర్యనారాయణ రావు (హైదరాబాద్)

* *

'27-4'-60 పత్రిక చాలా బాగుంది. అందులో 'తెలుగు—వెలుగు'ల శీర్షిక క్రింద కె. వి. రంగారెడ్డిని గూర్చి చాలా అందముగా వ్రాశారు. ఆ వ్యాసం మెచ్చుకోదగినట్లుగా ఉంది.

యార్లగడ్డ సీతారామయ్య, (కొమూను.)

"మీజాన్" తెలుగు దినపత్రికలో 'ధూపదీపాలు' వినోద శీర్షికతో వారి పేరు ప్రకటించనందుకు నొచ్చుకుని మరునటి దినం కునుకుతీయని వారని వ్రాశారు. ఆయన పేరు 'తెలుగు వెలుగు' శీర్షికలో పడానికి అలాటి కారణమే ఉందా?

వై. నరసింహారావు,
సి. పాండు రంగారావు,
(నంద్యాల.)

27 4 60 సంచికలోని ఉత్తరాలలో కొడుగుమూరు సుబ్బారావు, మిస్ యాక్స్ విమర్శలు చూస్తుంటే అవి వాస్తవానికి అనుకూలంగా వున్నట్లు తోస్తుంది. శుక్లపక్షచంద్రుని వలె వారం వారం అభివృద్ధి అవుతూ ఆబాలగోపాలాన్ని సంతోషపరచే ఆంధ్ర పత్రికను "ధ్వాన్నం" గా ఉందంటే యెవ్వరూ నమ్మరు.

డి. వి. దత్తాత్రేయ. (కసాపురం)

* * *

మీ పత్రికలలో 'ఉత్తరాలు' ఉత్తమమైన దని కొంటున్నాను. కాని క్రిందటివారం "అధ్వాన్నం" అంటూ వేసిన ఉత్తరం అధ్వాన్నంగా ఉండి శీర్షిక గౌరవాన్ని కొంచెం తీసింది. అలాంటి అభాండాలు అచ్చు వేయకండి.

జి. నారాయణరావు, (తెనాలి)

* * *

ఉత్తరాలలో కొందరు ఆంధ్రపత్రికను దూషించుచు వ్రాయుచున్నారు. వ్రాసిన వారిని వ్రాయకుండా చేయుచున్నారు. నాకు ఇటువంటి కథలు ఇష్టము. ఈవిషయముగా వ్రాయుటకు నాకు పరాధీనముగా ఉన్నది ఇటువంటివి వ్రాయకూడదు.

టి. మల్లారావు, (విజయనగరం)

## రెండుసార్లు

క్రిందటివారం ఉత్తరాలలో "మిస్ ఎక్స్" వ్రాసిన నిరాధార వాక్యాలకు నేను ఎంతో నొచ్చుకున్నాను. "మిస్ ఎక్స్" వ్రాసిన దంతయు, అసమంజసమైనది కనుక నే, ఆమె పేరు వ్రాయక "ఎక్స్" అని పేరు తెలియచున్నారు.. మీపత్రికను వారానికి మరోవారానికీ మధ్య ఒక 'సప్లిమెంటు'ను కూడా విడుదలచేస్తే మాకందరికీ కావల్సి వంటి "ఎంగేజ్ మెంటు".

కె. శ్రీరామమూర్తి, [విశాఖపట్టణం]

* * *

క్రొత్త సీరియల్ 'జీవనగంగ' చాలా బాగుంటున్నది. కథలో పటుత్వం శైలిలో సరళత్వం ఉట్టిపడుతున్నాయి. పురాణం సూర్యప్రకాశరావుగారికి నా అభినందనములు. మీ ఆంధ్రపత్రిక అందిన వెంటనే అయిపోతూ వున్నది వారానికి 2 సార్లు ప్రచురిస్తే చాలా బాగుంటుంది.

వై. సరోజమ్మ (కదిరి)

## సకుటుంబ....

ఆంధ్రపత్రికలో వారంవారం సీరియల్ గా ప్రచురితమౌతున్న "జీవనగంగ" చాల బాగున్నది. సంసారములలో నిత్యము జరుగుతున్న సంఘర్షణములను అతి చక్కగా చిత్రించేస్తూ, 'ముందేమిటి' జరుగుతుంది అన్న ప్రశ్నను ఎప్పుడూ ముగిసిపోకుండా ఉంచుతూ, నడుస్తున్నది కథ. రచయిత, శ్రీ సూర్యప్రకాశరావుగారికి నా ధన్యవాదాలు.

సకుటుంబపరివారంగా, ఓ చ్ఛే వారం పత్రికలకు ఉవ్విళ్ళూరుతూ ఎగబడి చూస్తున్నాం కథ చదవడానికి!

కా. కృష్ణశర్మ (న్యూఢిల్లీ)

* * *

మీ 'ఆంధ్ర పత్రిక వీక్లీ' నాకు నాకు "The good book for the hour" అన్నరన్కినివాక్యాన్ని గుర్తుకుతెస్తున్నది. ఇంకా కొత్త శీర్షికలు పెడారని ఆశిస్తున్నాను,

శేషు (సోంపేట)

పొట్టికథలు చాలా బాగున్నవి.

గంధి సుశీల (రాజమండ్రి)

## గళ్ళ నుడికట్టు

ఏప్రెల్ 20 వ తేది పత్రిక 64 వ పేజీ చూడగా షాక్ తగిలినట్లయింది. గళ్ళ నుడికట్టు గైరు హాజరైంది!

వి. రామకృష్ణ. (వైజాగ్.)

నుడికట్టో గొలుసుకట్టో ఏదో ఒకటి మరల ప్రవేశపెట్టవలని మా కోర్కె.

శేఖర్, (కాకినాడ.)

చాలా నిరాశాభావం కలిగించింది నుడికట్టు అభావం.

కొడవంటి రామకృష్ణ (విశాఖపట్నము.

...కనుపించవనిసరికి చాలా నిరుత్సాహము కలిగినది. ఇకేవిధముగా క్రీడారంగం కూడా కనుపించుటలేదు. తిరిగి ప్రచురించవలెను.

ఎ. ఎస్. రామమూర్తి,

(రూర్ కేలా, ఒరిస్సా.)

ఇకముందు ప్రచురించరా?

పుల్లాడ లక్ష్మీనారాయణగుప్త,

(హైదరాబాద్)

...రవ్వల నెక్లెసులో ఒక రవ్వపోతే ఎంత బాధగా వుంటుందో నుడికట్టు అభిమానులకు ఇపుడు సులువుగా తెలుస్తోంది... మేము అందరం బాధపడితే మీకు పాపం చుట్టుకోదా?

పి. ఆదిలక్ష్మి (నెల్లూరు.)

ఆంధ్రపత్రిక అలంకరణలో లోపము నుడికట్టు లేకపోవడమే.

జయరాం (నరసింహాపురం)

నుడికట్టు వేస్తారా? నా చందా నాకు ఇస్తారా?

పి. శంకరశాస్త్రి (పుల్లాపు)

పత్రికా కిరీటంలో నుడికట్టు ఒక రత్నం... అది లేక కాంతిహీనంగా ఉంది.

శారద, (మంచిలి ప. గో. జిల్లా.)

నుడికట్టు లేనందువల్ల పత్రికలో పంపు ఎందుకు తెన్నులు చూడటంలేదు.

ముందాళ శంకర ల్పోగరెడ్డి,

(పంగంజాగర్ల మూడి)

నుడికట్టు లేకపోవడం నాకు చాలా బాధ కలిగించింది. మరల ప్రచురించవలసిందని నా ప్రార్థన.

లక్ష్మీ, (పెదపాడు,)

63 వ పేజీ చూడండి.

* * *

6 4.60 వ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఆంధ్ర వ్యాదయోళ్ళర్యుడు శ్రీరాముడు అనే వ్యాసం చాలా బాగున్నది గాని అందులో కొన్ని పాటలు ఎంతో ఆశ్చర్యముగావున్నవి. అయోధ్యరాముడ్యు అన్నయ్య మాకు వలగన్నుల సీత వదినమ్మ మాకు అనేపాట ఏ రామాయణంలోలేదా ఏ పురాణంలో లేదా ఏ హరికథలోవున్నదో మాకు తెలియచేస్తే సంతసించెదము. ఇంతవరకు రాముడ్యు తండ్రి, సీతమ్మతల్లి అని అనుకొంటున్నాము గాని యిటువంటి కట్టుకథ తెలుగకుగాక వ్రాశినది ఏకథలో వున్నదో తెలియచేస్తే సంతసించెదము.

వంటూరు సుబ్బారావు.

(కిష్కిందపాలెం, గుంటూరుజిల్లా)

మీ ప్రాంతాలలోనే వినబడే జానపద గేయం.

## వనితాలోకం

ఈమధ్య ఆంధ్రపత్రికలో ప్రచురితమవుతున్న వనితాలోకం, వ్యాసాలు చాలబాగా వుంటున్నాయి. ఈ వ్యాసాలు చదవడం వల్లేనా కొందరు స్త్రీలు మారతారని విశ్వసిస్తున్నాను.

జి. భవూరాణి. హైదరాబాద్.

## సరళ

సరళగారి సలహా చాలాబాగుంది. ఎప్పుడు పత్రికవస్తుందా ఎప్పుడు చదువుదామా అని ఎదురు చూస్తూ ఉంటాము చదవడమే కాదు. కాని ఆచరిస్తున్నాము అంటే నమ్మండి తెలియకుండ చేసిన కొన్ని కొన్ని పొరపాట్లు సరిదిద్దుకుంటున్నాము కూడా చెప్పుడు మాట లు వినడం, చెవులుకొరుక్కోవడం, చిరుతిళ్ళు తినడం నిజంగానే తగ్గించుకొంటున్నాము సరళగారి సలహాలవల్ల మా సంసారము కొద్దివరకు పొందికగానే వుంటున్నది.

టి. లక్ష్మీ రాజమండ్రి.

## సీతగారి వ్యాసం

సీతగారి ఉభయపోక—కాలక్షేపం అన్నవ్యాసం బాగుంది. అందులో వారు చెప్పదలచుకున్నది సరిగా చెప్పలేకపోయారేమో ననిపించింది. అంతేగాకుండా కాలక్షేపముంటే యిరికి మాటలు పెంచడమని తెలిపారు. ఆ మాటలే ఎక్కువగా మాటలాడితే దానిని "వాగుడు" క్రింద జమకట్టాలు ము కసరిగా మాటలాడేవారు.

తుమ్మలపల్లి అనసూయ [విజయవాడ.]





# న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ

## ససేమిరా అని సరసకురాని చౌ!

వెనకటికి పుల్లయ్య వేమవరం వెళ్ళొచ్చాడంటే వెళ్ళొచ్చాడన్నారంతా!

అలాగే చైనా ప్రధాని చౌ-ఎన్-లై ఢిల్లీ రానూ వచ్చారు. వెళ్ళనూ వెళ్ళారు.

తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళనడం, పక్కయింటివారి ప్రహరీ పడగొట్టడం, పంచశీల మంత్రం జపించడం — ఇవే శ్రీ చౌ-ఎన్-లై!

ఢిల్లీకి చౌ రావడం పోవడం రెండూ అనుకున్నట్లు జరిగిపోయాయి. కాని కొందరు ఆశగా అనుకున్నట్లు జరిగిన సమాలోచనలు ఫలవంతం కాలేదు. భారత్‌ను పాలిస్తున్న కొందరు కాంగ్రెస్ పెద్దల మంచితనం ఆసరాగా తీసుకుని ఆయనపని జరుపుకు పోయారు. నోటితో నవ్వుతూ, నొసలుతో వెక్కిరిస్తూ పంచశీల మంత్రాలు వల్లిస్తూ తాను ఆక్రమించుకున్న భూభాగం భారత్‌కు చెందదనే పిడివాదం కొనసాగించారు.

కాంగ్రెసులో ఆయనకు కావలసినంత మంది సానుభూతిపరులున్నారు! పార్లమెంటులో కాంగ్రెసు సభ్యులొకరు బాహాటంగా లడక్ నుంచి చైనా వైదొలగడం అసాధ్యం అన్నారు. ఆ ప్రాంతంలో రోడ్డు నిర్మించి పాలన సాగిస్తున్న వీరు ఎలా తొలగిపోతారని ప్రశ్నించారు. ఈ పెద్దమనిషి ఒకవైపు ఇలాంటి మాటలు మాటాడుతూ పైగా పాకిస్తాన్ పోర్చుగల్ వ్యవహారాలు వచ్చినప్పుడు 'దురాక్రమణ' — "దురాక్రమణ" అని పెడ బొబ్బలు పెట్టగలడు. ఆక్రమిత ప్రాంతాలనుంచి వాటిని వైదొలగమనడం ఇటువంటి వ్యక్తులకెలా వచ్చు? ఇలాంటి పెద్దలు నాలికను విశృంఖలంగా వాడివేసి జనంలో ఒకవిధమైన జాతీయ నైతిక పతనానికి కారకులౌతున్నారు. మనకంతా ఉపన్యాసకులే! సలహాదారులే! ఈ సంగతి శ్రీ చౌకి బాగా తెలియకపోతే ఈ అవకాశం బాగా వినియోగించుకుని ఉండేవాడు కాదు.

శ్రీ చౌ ఢిల్లీ వచ్చినప్పుడు ఆయనతో మంతనాలు సాగించడానికి శ్రీ పంత్, స్వర్ణసింగ్‌ను శ్రీ నెహ్రూ ఎన్నుకున్నారని ఒక అధికారి వెల్లడించారు. అప్పుడు శ్రీ కృష్ణమీనన్ పేరు వినిపించలేదు. కాని చౌ రాగానే మీనన్ వెళ్ళి రెండుగంటలసేపు ఆయనతో సంభాషించారని పత్రికలలో వార్తపడింది. ఇంకా చాలా సంభాషణలు, విందులు జరిగాయి. వీటికి మంత్రులలో శ్రీ కె. డి మాలవీయను మాత్రమే ఆహ్వానించారు. శ్రీ కృష్ణమీనన్‌కూడా దొడ్డిదారిన సమాలోచనలలో పాల్గొనాలని శ్రీ నెహ్రూ కోరికపోయినట్లయితే తనకు తానే అయినా ఆయన సిద్ధమయ్యేవాడు. చిత్రమైనవాడు!

శ్రీ మీనన్‌ని మలబారీగా శ్రీ నెహ్రూ పేర్కొన్నారు. కొబ్బరి చెట్టెక్కడంలో గట్టివాళ్ళు మలబారీలు. ఈ సమాలోచనలపట్ల శ్రీ మీనన్ వైఖరికి నెహ్రూ చేసిన వర్ణన సరిపోయింది.

లాబీల సమాచారాల ప్రకారం పార్లమెంటు ఆగస్టు సమావేశాలు శ్రీ కృష్ణమీనన్‌కి ఒక సవాల్‌గా ఉంటాయని తెలుస్తున్నది. అప్పటికి జీప్ కార్ల రగడలో కొలికిపూసలవంటి రహస్యాలు బాగా బయటపడతాయి. ఆడిటర్ జనరల్ నివేదికపై పబ్లిక్ అక్కౌంట్సు కమిటీవారి పరిశీలన బయటికి రాగలదు.

ఇక పార్లమెంటులో పరాజితులైన శ్రీ ఫిరోజ్ గాంధి పబ్లిక్ అక్కౌంట్సు కమిటీలో తన పలుకుబడిని చూపి తన మిత్రుడు శ్రీ మీనన్‌ని కాపాడడానికి ప్రయత్నిస్తున్నారు.

కాగా, అటు చౌ, ఇటు నెహ్రూ కూడా 'ససేమిరా' అంటే 'ససేమిరా' పద్ధతిలో భీష్మించుకున్నారు.

శ్రీ ఎడ్గార్ స్నో చైనాను చాలా కాలం చూసినవారు "రెడ్ స్టార్ ఓవర్ చైనా" అనే పుస్తకం ద్వారానే అసలు ఆయన అంత పేరులోకి వచ్చారు. ఆయన ఈమధ్య ఒక చైనా సామెత చెప్పారు "వాళ్ళ చెయ్యి వాళ్ళే కాల్చుకోనిచ్చి, పైపంచ లాక్కొని డబ్బుకూడా చెల్లించమన్నాం" అని సామెత. అది శ్రీ చౌకే చెల్లింది! ఆయన మన చేతులు కాల్చారు మన పంచ లాక్కున్నారు మన చేతులు కాల్చడానికి తను పడ్డ శ్రమకు రుసుం చెల్లించమంటున్నారు!

మన కాంగ్రెసు పాలనలో ఎంతసేపూ అహింస మీద అమిత విశ్వాసం తప్పించి సరిహద్దులపై జాగ్రత్త లేకుండా పోయింది. కమ్యూనిజంలోనూ, ముఖ్యంగా చైనావారిదా వీరికి ఎందుకో ఇంత విశ్వాసం!

ఇది ఇలా ఉండగా చైనాకీ రష్యాకీ అంత స్నేహం లేదనీ ఆదర్శాలలో తేడా వున్నదని అమెరికావారు అంతా అనుకుంటున్నారు, కానీ టిబెట్‌లో కొన్ని విమానాశ్రయాలు సాక్షాత్తు రష్యా కట్టిందని వార్తలు!!!

* * *

ఒక్క ఆరోగ్యవిషయం మినహాయిస్తే సంతాన నిరోధక చర్యలు చాలా అవసరమంటూ ఆరోగ్య విచారణ; అభివృద్ధి కార్యాల సంఘం (1947) సూచించింది. తదనుగుణంగా ప్రథమ పంచవర్ష ప్రణాళికలో కుటుంబ నియంత్రణ పథకం ఒకటి రూపొందించబడింది. అందుకు 65 లక్షల రూపాయల కేటాయింపు కూడా జరిగింది.

ఆ కేటాయింపులో రాష్ట్రప్రభుత్వాలకు స్వతంత్ర సంస్థలకూ శిక్షణ కార్యక్రమాలకూ, విద్యాబోధనకూ, పరిశోధనకూ సబ్సిడీలు యివ్వాలని నిశ్చయించింది ప్రభుత్వం.

ఆ ప్రకారం విస్తృతంగా అన్నిరంగాలలోను యిందుకు కృషి జరిగింది. గ్రామీ

నగర ప్రాంతాలలో వైద్యశాలలు కూడా నెల కొల్పారు.

ఇక రెండవ ప్రణాళికా కాలంలో కుటుంబ నియంత్రణ పథకాలు బహుముఖా లుగా రకరకాలుగా వ్యాప్తినొందాయి కూడా. విద్యాబోధనా కేంద్రాలు బాగా ఏర్పాటుచేశారు. కుటుంబ జీవనం గురించిన విజ్ఞానం బోధించే కృషికి బాగా శిక్షణనిచ్చి సలహాదారులను తయారుచేశారు. జనాభా సమస్యలు, పిల్లల పెంపకం, సెక్సు విద్య లలో పరిశోధన, బోధన ఇతోధికంగా సాగింది. ఈ కార్యక్రమానికి మొత్తం 5 కోట్లు ద్వితీయ ప్రణాళికా కాలంలో కేటాయించారు. కేంద్ర కుటుంబ నియం త్రణబోర్డు 1956 లో స్థాపించారు.

1959 అక్టోబరు నాటికి మరో 1000 వైద్యశాలలు- వైద్య సహాకేంద్రాలు నెల కొల్పారు.

మన దేశంలోగల మొత్తం 310 జిల్లా లలోను, 262 జిల్లాలలో కుటుంబ నియం త్రణ కేంద్రాలు ఏర్పాటుచేశారు. సంతాన నిరోధక సాధనాల కొనుగోలు బాగా పెరిగి పోయింది. అంతేగాక 'స్టెరిలైజేషన్' పద్ధ తులుకూడా ప్రభుత్వం ప్రవేశపెట్టింది. 80 లక్షల మందికి వీటితో ఉపయోగం ఉంటే 15 లక్షల మందికే సంతాన నిరోధక పరిక రాలు మనదేశంలో తయారవుతున్నాయి. ఇవి మగవారికే పనికివస్తాయి. ఇక ఆడ వారి ఉపయోగార్థం-80 లక్షల పరికరాలు కావలసివస్తోంది. అయితే అవి మన దేశం లో దొరకడం లేదు విదేశీ ద్రవ్యమారకం నూత్రాలు వీటికి అంతగా వర్తించకుండా ప్రభుత్వం చూస్తోంది దానికి కారణం ఇవి మన దేశంలో దొరకకపోవడమే! ఇప్పుడిప్పుడే వీటి తయారీ మన దేశంలో ప్రారంభమైంది.

కుటుంబ నియంత్రణం ప్రాధాన్యత ప్రజలందరికీ బాగా తెలిసేటట్లు గట్టి ప్రచారం ముమ్మరంగా సాగిస్తున్నారు. కరపత్రాలు, సినిమా స్లయిడ్లు, పత్రికలు వీటి ద్వారా ప్రచారం బాగా జరుగుతోంది ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిసెర్చి అధీనంలో వైద్య శారీరక పరిశోధనలు బాగా జరుగుతున్నాయి.

ఇలా ఇంతవరకు జరిగిన గట్టి కృషి మూలంగా ప్రభుత్వం తీసుకున్న ఈ బాధ్యత బాగానే నిర్వహించిందని చెప్పాలి. ఇది నీతికి 'నాతి' దూరం అనే నమ్మకం ప్రజల లో యిప్పుడిప్పుడే కలుగుతున్నది. ప్రజాభి ప్రాయం ఇటు మొగ్గుతున్నది కూడా.

తృతీయ ప్రణాళికలో ఈ కార్య క్రమానికి మరింతగా ప్రాధాన్యం ఉంటుంది 1959 సెప్టెంబర్ లో ఇందుకు తగు పథకం రూపొందించడానికి శ్రీమతి ధన్వంతి రామా రావు ఛైర్మనగా ప్రభుత్వం ఒక కమిటీని నియమించింది.





బుద్ధజయంతి : వైశాఖ పౌర్ణమి; మే 11.

క్రూరాలవాలు కాతలపై
కాలిజాడ లెన్నెన్నో
వైశాఖపు వెన్నెలలో
విరిసిందొక అడుగుజాడ!
లుంబిని జగదనాథ కా
లంబన మొనరించినది
ధమ్మపథం గత చరణం
అమ్మలాంటి కరుణాళువు!
పంచశీల సూత్రముల ప్ర
పంచశీల చిత్రణతో
పరాకాష్ఠ నందుకొన్న
ధరాతలాంకిత చిహ్నం-
ఆ పాదం ఒక మహోజ్జ్వ
లాశా ఫల పాదపం.
తరతరాల శాంతి కవి
త్వానికి అది మలిపాదం-
పాపం గత ప్రపంచాన
స్తూపం గత కృపాదం

—రాఘవం.

సంధ్య వెలుగులో ప్రకృతి విరగబడి నవ్వినట్లయింది. ఉత్తర దక్షిణాలుగా వున్న దూరపు కొండకు వామభాగాన సూర్యుడు అస్తమించబోతున్నాడు. గాలులు, ఒత్తుగా పెరిగిన వృక్షాలను దూసుకుపోతూ శ్రావ్యంగా సంగీతం పాడుతున్నాయి. రంగుల పిట్టలు బంగారు కాంతులలో పల్టీలు కొడుతూ అనేక శ్రుతులలో అవ్యక్తమైన రాగాలు పాడుతున్నాయి. మదనుడు పిట్టగోడ నానుకుని సూర్యాస్తమయ శోభను తిలకిస్తున్నాడు. అతని కొంత దూరంలో నుంచుని హరి మెట్ల క్రిందకు తొంగి చూచాడు అనేకలోయ. లోతుగా ఎక్కడో పాతాళంలో చిందరవందరగా వున్న రాళ్ళను దూసుకుపోతూ ప్రవహిస్తోంది సెలయేరు. అప్పటికే సంధ్య చీకటి మెల్లగా లోయలో వ్యాపించింది.

ఇద్దరూ అట్లా మౌనంగా కొన్ని క్షణాలు గడిపారు.

"హరీ .. అటు చూడు...ఆ పర్వతానికి వామభాగాన అస్తమిస్తున్న సూర్యుడు ఎట్లా వున్నాడో...ఒక మహానుభావుడు భౌతిక దేహాన్ని విడిచి దహనసంస్కార సమయంలో ప్రజ్వలించి ఎర్రటి కాంతులు వెలికివచ్చినట్లు.."

హరి వులిక్కి పడ్డాడు. "అబ్బ!...ఏమి ఊహ...అంతకంటె సుందరమైన అలంకారమే దొరకలేదు..అయినా అస్తమయం అంతరమణీయంగా వుంటే నువ్వు బీభత్సం చేసి వదిలావు."

'ఏమో!...నాకట్లా అనిపించింది...అన్నాను."

"అందుకే నీ కవిత్వం అంటే నాకు మంట. రివ్వున వీచిన గాలికి రాలిపోయే ఆకులను...భూతవైద్యుణ్ణి చూచి పారిపోయే దెయ్యాలా వున్నాయంటావు...చచ్చు ఊహాలూ.. నువ్వూను"

"నాకట్లా రాయడం సరదా అంటూవాకే...నాకు అప్పుడు అట్లా అనిపిస్తుంది...అట్లా రాస్తా..."

"సరే! నీ ఇష్టం వచ్చినట్లు రాయి ఎట్లా రాస్తే ఎవరికెక్కువాలి..."

ఆ ప్రస్తావన అప్పటికి ఆపేశారు. ఇద్దరూ వచ్చి మౌనంగా రెండు కుర్చీలలో కూర్చుండిపోయారు. భానుడు అపరాంగన ఒడిలో ఒదిగిపోయాడు. గగనతలాన మబ్బు దొంతరల చివరలు ఎర్రబడి సౌందర్యాన్ని చేకూర్చుతున్నాయి.

మదనుడు ఆ అరణ్యప్రాంతపు ఫారెస్టు ఆఫీసరు అరవిందుని ఏకైక పుత్రుడు. అరవిందుడు మదనుణ్ణి అల్లారుముద్దుగా పెంచాడు. మదనుడి రెండో ఏట అతని తల్లి పోయింది. అప్పటి నుండీ మదనుడిలో తన భార్యను చూచుకుంటూ అతి గారాబంగా పెంచుకున్నాడు- అరవిందుడు.

మదనుడి బాల్యమిత్రుడు హరి. హరి తండ్రి అరవిందుని ఆప్తమిత్రుడు. ఈ రెండు కుటుంబాలకూ మైత్రి తరతరాలుగా వర్ధిల్లుతోంది. హరి రాకపోతే మదనుడు తత్తరపడిపోతాడు. ఈ భవనానికి నాలుగుమైళ్ళ దూరంలో వున్న పట్నంలో హరి వుంటాడు. హరి ప్రతిరోజూ ఒక్కసారైనా వచ్చి మదనుణ్ణి చూచిపోతుంటాడు. హరి రాకపోతే మదనుడే తన తండ్రి కారులో పట్నంవెళ్ళి హరిని కలుసుకుంటాడు.

ఇద్దరూ కలసి బి. ఏ దాకా చదివారు. ఆ చదివిన రెండేండ్లూ మదనుడు హరి ఇంట్లోనే వున్నాడు. హరికి ముగ్గురు అక్కలూ ఒక్క చెల్లెలూ. వాళ్ళు మదనుణ్ణి అన్నగా చూచుకునేవారు. మదనుడికి వాళ్ళనుచూస్తే ముచ్చటవేసేది. కొందరిచేత తను కావాలని 'తమ్ముడూ' అని పిలిపించుకునేవాడు. తనకు అక్కలు లేరు. చెల్లెళ్లు లేరు. తనను ప్రేమతో ఆదరించే తల్లి లేదు. తనకు మాతృప్రేమ ఎటాంటిదో తెలియదు. హరి తల్లిని చూచి మదనుడు చాటుగా కంటతడి పెట్టుకునేవాడు

## పాలపర్తి సుముఖేశ్వరరావు

ఆ తర్వాత మదనుడు చదువు మానేశాడు. హరిమాత్రం ఎం. ఏ చదివాడు, పరీక్షలు రాసి వచ్చాడు. హరి చదువుకూడా పూర్తి అయిపోయింది. హరి వచ్చి రోజంతా మదనుడి ఇంట్లో గడిపేవాడు. ఇద్దరూ కలసి అడవి ప్రాంతమంతా చుట్టివచ్చేవారు. మేడ మీద కూర్చుని ప్రకృతి శోభను చూస్తూ వుండిపోయేవారు. రాత్రి వేళకు హరి అరవిందుడి కారులో ఇల్లు చేరేవాడు

మదనుడికి హరి లేకపోతే తోచదు. ప్రకృతి అందంగా కనిపించదు. అతని లోయలో ప్రవహించిపోయే సెలయేరు ఆకర్షించలేదు. సంధ్యకాంతుల్లో ఎత్తుగా ఒత్తుగా వున్న వృక్షాల చిగురుటాకుల మెరుపులూ, ఆ గాలితో దోబూచులాడుతున్న రంగు రంగుల పక్షులూ, మహానుభావుడి విశాల ఫాలపు ప్రశాంతతను యిముడ్చుకున్న దూరపుకొండల సొంపు అతనిని ఆనందపరచలేవు. హరి ఎదురుగా వుంటే మదనుడి వూహాలు వింత పోకడలు పోతాయి

అరుణ వర్ణాన్ని వీడలేక, వీడి వెల్లబడ్డాయి-మబ్బు దొంతరలు. లోయలో చీకట్లు దట్టమైనాయి నౌకరువచ్చి విద్యుద్దీపం వెలిగించి వెళ్ళాడు.

"ఒకే మదన్! నేను వెళ్ళి భోజనం చేసి వస్తా..."

"వెంటనే వస్తావా?..."

ఆ! మీ నాన్న కారు వేసుకువెళ్ళలేదుగా. దానిమీద వెళ్ళివస్తా.

"సరే! త్వరగా వెళ్ళిరా. నేనూ ఈలోపల భోజనం చేస్తా"

హరిని మెట్లక్రిందదాకా సాగనంపి, త్వరగా రమ్మని మరొక్కసారి హెచ్చరించి వచ్చి తన గదిలో కూర్చున్నాడు మదనుడు.

దినకరుని అస్తమయంతో ప్రకృతి అంధకారంలో మునిగిపోయింది. నింగిన చుక్కలు మిలమిలలాడి తిమిరుని కుక్షిలో ఒదిగిపోయిన జగతికి వెలుగునివ్వలేక వెలవెలబోయాయి. కిరణజాలంతో తొంగిచూచి 'నావల్ల కాద'న్నట్లు రేఖగా తోచి చీకటిలో లీనమయ్యాడు. శతథా విస్తృతమైన చీకటిని చీల్చుకోలేక పోతూ...పోయి మాయమయ్యే విద్యుద్దీపపు కాంతులను తిలకిస్తూ కూర్చున్నాడు— మదనుడు. ఒక గాలి తెరచిన తలుపుగుండా వీచి మదనుడికి తాకి గిలిగింతలు పెట్టింది. మదనుడి మేను పులకించింది.

సోఫాలో వెనక్కు జేరబడి హాయిగా ఒక నిట్టూర్పు విడిచాడు. ఏదో పత్రిక తిరగేశాడు. పట్టుమని ఒక కథకూడా చదవలేకపోయాడు. ఏమీ తోచడంలేదు. పత్రిక మూసి ఆలోచనలోకి దిగాడు.

నిజానికి హరి అన్నట్లు తన ఊహలన్నీ విపరీతంగానే వుంటాయి. తను రాసే కథలలోకూడా తనకు తెలియకుండానే అనేక సందర్భాలలో చాలా విపరీతమైన ఊహలు రాశాడు. తనకు తట్టే ఊహలు అటువంటివి. అంతకంటే మధురంగా, అంతకంటే సుకుమారంగా తను రాయలేడు. సంధ్య వెలుగులలో మబ్బులు తన కంటికి కసాయి కొట్టులో వరుసలుగా కట్టిన మాంసపు ఖండాలుగా గోచరించాయి...తన దురదృష్టమేమో అది...తను ఎన్నోసార్లు మధురంగా వ్రాయాలని ప్రయత్నించాడు. కలం కదలింది కాదు...అయినా తనేం చేస్తాడు! ఎవరి సంస్కారాన్ని బట్టి వాళ్లు ఊహిస్తారు...మరి తన సంస్కారం ...

తనకు ప్రకృతి తోడు. ప్రకృతిలో లీనమై ఆనందిస్తాడు. ప్రకృతిని చూచి భయపడతాడు. తను మేడమీద కూర్చుని లోయలో కటిక రాళ్ళను చీల్చుకుంటూ ప్రవహించి పోయే ఏటినీ, దానికి ఇరుపక్కలా ఒత్తుగా ఎత్తుగా వున్న వృక్షాలనూ, రకరకాల పక్షుల కలకలారవాలనూ వింటూ కంటూ తన్ను తాను మరిచిపోతాడు. ఆ విశాల ప్రకృతిలో తను ఏకాకియై భయపడతాడు. అతనికి ప్రకృతి ఆ సమయంలో ప్రళయరూపం దాల్చిన రక్కసిలా అగుపి

(61-వ పేజీ చూడండి)

# ఉత్తర రాత్రి

వేలూరి సహజానందం



అంధకారంలో పాడుస్తున్న మదగజేంద్రం లాగా ఘీంకరిస్తోంది రైలు ఇంజన్. కొత్త సినిమా ఆరంభమయ్యాక వచ్చినవాళ్ళ లాగా ప్రయాణీకులు ఒకరి కాళ్ళ కొకరు బందాలు పడుతున్నారు. పోర్టరు నామీద చిరాకు పడుతున్నాడు. ఏ పెట్టెలోనూ అడుగుపెట్టక, వాడిని అటూ ఇటూ తిప్పుతుంటేని. కొంచెం హస్తలాఘవంతోనో, వినయవిధేయతలతోనో ఏదో ఒక పెట్టెలో ఎక్కవచ్చును. కాని ఒక్క పెట్టయినా నచ్చలేదా. అందులోనూ నేను కిటికీదగ్గర కూర్చోవాలి. రైలుపెట్టెలో కూర్చొన్న ప్రయాణీకులకేసి ఇంకా ఎక్కని ప్రయాణీకులు చూస్తే, కందిరీగల తుట్టెను కదిలిస్తున్నట్టుగావుండి, కంపరం పుట్టుతుంది. వెనక వచ్చినవాడంటే ఎందుకో అంత అలుసు. అందరూ ప్రయాణీకులే. పైగా అందరూ అదే రైలులో వెళ్ళాలి. అందరూ ఒకే వూరికి వెళ్ళరు. ఎవడి గమ్యస్థానం వాడిదే. కాని అందరిని వారివారి గమ్యస్థానాలకు చేర్చే, రైలుమాత్రం ఒక్కటే. ప్రతివాడూ రైలెక్కి దిగేవాడే. ఎవడూ తన వెంట నిసలా రైలును తీసుకొనివెళ్ళడు. అయినా కూడా ప్రతివాడూ రైలు తనదే అయినట్టుగా ఛాతీ విరుచుకొని కూర్చుంటాడు. ఇంతకీ నేనే ముందెక్కి కూర్చొనివుంటే ఎలా వుండేదో మరి! ఉత్సవపు పందిరిలా వుంది ప్లాట్ ఫారం.

టిక్కు టిక్కుమంటూనే చూశాను. వెనక నుంచి పోర్టర్ ప్రోత్సాహపరుస్తున్నాడు. ఫరవాలేదు, మూడువందల మైళ్ళ పెట్టె అయితేయేం, ఎక్కండిఅని అంటున్నాడు. నా అంగీకారంతో అవసరం లేకుండానే పక్కచుట్ట పెట్టెలో పడేశాడు. ఏదైనా టికీదగ్గర కూర్చోవాలన్న నా కోరిక వాడికి కసలు నచ్చలేదా! అసలు చోటు అనేది లేకుండావుంటే, కిటికీదగ్గర జాగా ఎలా లభిస్తుందంటాడు. ఎక్కడ చోటు లభిస్తే, అక్కడే కూర్చోమంటాడు. లేదా నిలబడమంటాడు. ఇలా అదే పనిగా వెతికితే వున్న చోటుకూడా పుట్టి కొసరుతుందంటాడు.

"ఏం పాపం! అప్పుడే వచ్చారు?"

లోపలనుంచి ఉరిమాడు ఒకాయన.

కనికరించమన్నట్టుగా ఆయనకేసి చూశాను.

ఉహూ!

"రైలు కదులుతున్నప్పుడే రాక పోయారా?

"మేమంతా తెలివితక్కువవాళ్ళం. మహా మీరు మాత్రమే..."

"నేనా తెలివిగలవాడిని...కాదు...... కాదు" అని ఒప్పుకున్నాను.

"అబ్బ...ఏం తెలివితేటలండీ" అంటూ, పోర్టర్ తలుపుదగ్గర పక్కచుట్ట సర్దటం చూసి, "ఇదిగో, ఏయ్కూలీ, ఇది మూడు వందల మైళ్ళ పెట్టె" అని హుంకరించాడు హుందాగా వున్న మరొక ప్రయాణ మిత్రుడు.

పోర్టర్ జవాబుచెప్పక నాకేసి చూసి, నీ కర్మ నీదే అన్నట్టుచూసి వెళ్ళిపోయాడు.

మెల్లిగా తలుపు తోశాను. ఎవరికేసి చూడటానికీ ధైర్యంగాలేదు. పెట్టెలో ఎక్కడైనా "శూన్యం" వుందేమోనని ఓరగా చూడటం మొదలుపెట్టాను. గార్డు

# ఉత్ప్రవరాత్రి

ఎందుకో అప్రయత్నంగా నా కళ్లు అతని లాల్చీ పక్క జేబుమీద వాలినయ్. మామూలుగా చాలామందికి చొక్కాలకు ఒక జేబు మాత్రమే వుంటుంది. కాని కొందరికి రెండు, లోపల చాలా జేబులు వుంటయ్. ఈ పెద్దమనిషి వాళ్లలో ఒకడులాగా వున్నాడు. కనపడిన వాటన్నిటినీ చేతనైతే ఒక్కొక్క జేబులో మడిచి పెట్టేసుకోవాలని వుంటుంది.

గార్డు ఈలవేశాడు.

“తియ్యండి దబ్బున తలుపు”

ఏదో సన్నని గొంతు. కిటికీలో గాలికి జుట్టు రేగుతున్న ముఖం. మబ్బులను విదిలించేసుకుంటూ చంద్రబింబం నా కళ్లెదుటకు వచ్చినట్లుంది. ఇంకా మేఘశకలాలు అంటుకొని వున్నట్లు. చోటు లేదంటున్నాడు కొత్త ప్రయాణీకుడు.

“చూస్తారేమండి.. తియ్యండి తలుపు”

అదే సన్నని గొంతు.

మాట్లాడింది ఆ లేత పెదవులా? లేక ఆ కళ్లా?

“నన్నే! ధన్యోస్మి.

“ఊఁ.. ఇదిగోండి బెడింగ్”

అమాంతం హోల్డ్ ఆల్ ఒకటి నామీద పడ్డది. లేచి అందుకున్నా.

“ఇదిగో సూట్‌కేస్”

“నన్నే! హతోస్మి.

గార్డు ఈలవేసేశాడు. రైలు కదులుతోంది. మంచినీళ్ల డబ్బా, చేతిసంచి వగైరాలు ఏవేవో దూసుకోవచ్చి పడినయి. తలుపు సందులోంచి పాముపిల్లలా ఆపడుచు పెట్టెలోకి రానే వచ్చేసింది. మయూర నృత్యం చేస్తోంది నా మనస్సు.

“ఇక్కడ కూర్చోటానికి కాస్తైనా చోటు లేదు.”

“పక్క పెట్టెలో ఎక్కకపోయారా?” అన్నాను. కేవలం లాంఛనానికి.

“వాళ్లు తలుపు తాళం వేసేశారు” అంది.

ఎవడో అందుకున్నాడు.

“అది ఆడవాళ్ల పెట్టెకూడా. ఆడవాళ్లు ఆడవాళ్ల పెట్టెలో కూర్చోక మగవాళ్ల పెట్టెలో తయారవుతారు.”

ఆవిడగారి సామానన్నీ సర్ది కొంత తలపైకెత్తాను. ఆ మహాపురుషుడు కేలవిచ్చాడు. “మిత్రమా! చాలా శ్రావ్యంగా పెత్తనం వేసుకొన్నావు” అని నాకేసి చూసి ఇంచుమించు పకలించాడు. ఔన్నత్య! బ్రతుకు బరువుతీరినట్లుంది నాకు అలతోంగని గూసీ!

ఏమనాలో నాకేమీ తోచలేదు. సామాన్లు సర్దేప్పటికి నాకు చూడాలు లాక్కువస్తున్నయ్. పుటుక్కున ఆయువతి కొంచెం ఇంగ్లీషులో జవాబు చెప్పేసింది. “ఆయనకేం ఫరవాలేదు” అని.

పాపం ఆ మహాపురుషుడు కళ్లప్పగించి చూస్తున్నాడు. గొంతుకలో గొణిగింది గానీ అది బెంగాలీ కాదు, ఏ భాషా కాదు. వాడి, అంగ్లం గాదేమో!

రైలు వేగం అందుకుంటోంది. కుమ్మంలో ప్రయాణీకురాలు, నేను ఎదురు బొదురుగా కూచున్నాం. రైలు పెట్టె గట్టిగా ఊగితే, మా ముఖాలు ఢీకొనేట్టు వున్నాయి. నా పక్కచుట్టు కెదురుగా ఆవిడగారి హోల్డ్ ఆల్‌ను సామాన్ల పైన వేసి, దానిమీద కూర్చున్నాను. ఆయువతి అటు ఇటు చూస్తోంది గాని, నా పక్కరాన్ని అంగుకోలేదు.

(51-వ పేజీ చూడండి)



## 33

శ్రీ కొత్తా రఘురామయ్యగారు రాజకీయాలకు కొంగ్రొత్త కాకపోయినా కొత్త. భారత రిపబ్లికు రాజ్యాంగం క్రింద ప్రప్రథమంగా జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థిగా పార్లమెంటుకు నిలబడటమే ఆయన రాజకీయాలలో ప్రవేశించడం. 1952 వ సంవత్సరంలో ఎన్నికలు జరిగినా; 1951 ఆఖరుభాగంలో రఘురామయ్యగారు కాంగ్రెసులో చేరారు. చేరేముందు మద్రాసు ప్రభుత్వంలో న్యాయశాఖ సంయుక్త కార్యదర్శిగా ఉన్నారు. నిక్షేపం లాంటి ఉద్యోగం మానుకొని సరాసరి ఎన్నికలలోకి దిగటం చూసి, 'పేకాటలో పెన్ముక్కలు లేకుండా పెద్దగా ఒడ్డటంలా ఉన్నది మనవాడి తరహా' అన్నారు బంధుమిత్రులు; కలవాడతని కేమన్నారు ఇతరులు. అందులో అప్పుడు అంతఃకలహాలతో కాంగ్రెసు ప్రతిష్ఠ రాష్ట్రంలో నేలమట్టానికి మాత్రమే ఉన్నది. ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశంగారూ, కిసాను కేసరి ఎన్. జి. రంగాగారూ ప్రజాపక్షాన్నీ, కృషికార్లోక్ పక్షాన్నీ స్థాపించారు.

అయితే ఆనాటి ఆ జూనంలో రఘురామయ్యగారు గెలిచారు. నెల్లూరుజిల్లా మొదలుకొని శ్రీకాకుళంవరకు యోధానయోధులైన కాంగ్రెసు పెద్దలందరూ తుపానులో కొబ్బరికాయలలాగా ఎన్నికలలో రాలిపోయారు.

రఘురామయ్యగారు గెలవటానికి, ఆయనకి గతచరిత్ర అనేది లేకపోవటమే కారణం. చరిత్రలేని దేశం అదృష్టవంతమైనదన్నాడు ఒక పాశ్చాత్య రచయిత. ఇది దేశాలపట్ల ఎంత నిజమో వ్యక్తులపట్లకూడా అంత నిజమూను. వారిని గురించి చెప్పుకోవడానికి, చెప్పడానికీ మంచీలేదు; చెడూ లేదు. అలా లేకపోవడమే వారికి మంచిదైనది.

రాజకీయ నాయకుని జీవితానికి సినిమా తార జీవితానికి చాలా సామీప్యం ఉన్నది. శాసన సభ్యుడుగా ఉన్న ప్రతి వ్యక్తికి ఓ సంజీవరెడ్డో మరో సంజీవయ్యో అవాలని ఉంటుంది. పార్లమెంటు మెంబరు అయిన వారికి ఏ నెహ్రూనో ఏ దేశాయో అవాలని ఉంటుంది; సినిమాలో ఎక్స్‌ట్రాగా వెళ్ళిన ప్రతి అమ్మాయికీ భానుమతో, కన్నాంబో, అంజలీదేవో కావాలని ఉంటుంది. ఆ కోర్కెలను మనసులో పెట్టుకొని కలలు కంటూ ఉండడమే వారికి జీవితానికి ఊతగా ఉంటుంది. కృషి లేక కేవలం ఇలా కల్పప్రపంచంలో ఉండేవారు దానిలో కలిసిపోతారు. కాని ఓపికతో కాచి, వేచి మెట్టు మెట్టుగా సాధించేవారు కృతకృత్యులవుతారు. రఘురామయ్యగారు ఈ తరహాకు చెందినవారు. దిగీ దిగడంతోనే మంత్రి కావాలని తొందరపడలేదు. తాను కాంగ్రెసు రాజకీయాలకు కొత్త అని తెలుసు. అందువల్ల మొదట కాంగ్రెసు పార్టీ మెళుకువలన్నీ తెలుసుకొన్నారు. కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ సెక్రటరీ అయినారు. రెండవసారి ఎన్నికలు అయిన తరువాత రక్షణ ఉపమంత్రి అయినారు. మొదట రాష్ట్ర రాజకీయాలలో తల దూర్చారుగాని, తలనొప్పి తరువాత తప్పుకొన్నారు. దానివల్ల మంచి వచ్చిందా చెడు వచ్చిందా అన్నది వేరేవిషయం. గుంటూరుజిల్లా, ప్రముఖులు ప్రతిభావంతులు అయిన పెద్ద నాయకులనూ, చిన్న నాయకులనూ చాలామందిని దేశానికిచ్చింది; వారందరిమధ్యా పడి నలగకుండా తెలివిగా తప్పుకొని పైకి రాగలిగినందుకు రఘురామయ్యగారిని నిజంగా మెచ్చుకోవలసిందే. రక్షణశాఖ ఉపమంత్రిగా తమ విధులను శ్రద్ధగా సమర్థంగా నిర్వహిస్తున్నారు. పార్లమెంటరీ విధాన ప్రభుత్వంలో మంత్రిగా రాణించటానికి కావలసిన విద్య, ఓపిక, విచక్షణశక్తి మొదలైన హంగులు ఉన్నాయి. విద్యార్థిదశలోనే వక్తృత్వానికి బహుమతులందుకొన్న వాగ్ధాటి ఉంది. పైగా శ్రీమంతులు. వయసులో చిన్న. అందువల్ల భవిష్యత్తు ఎంతైనా ఉంది. ★

# వర్షం వచ్చిన రోజు

## కె. వి. ఎస్. అచ్యుతవల్లి

—వానగాలి! నాలుగువేల రూపాయల ఫురెన్ స్వెటర్లో వున్న తనే గజగజలాడ్తూంటే వంటిమీద గుడ్డయినా లేకుండా అప్పిగాడెలా వున్నాడో! ఎల్లి మాత్రం? కొబ్బరి నీళ్ళతో నిగనిగలాడే చల్లంగి ఆంజనేయ స్వామివారి విగ్రహంలావుంది. జుట్టుమీంచి వంటిమీదికి జారుతున్న వర్షపుచినుకు బొట్లని లెక్క చెయ్యకుండా ఒలిచిన మొక్కజొన్న పొత్తుల్ని ఆకలి కుంపటిలో వేసి మంట చెయ్యటానికి ప్రయాస పడుతూన్నది.

ఇనప్పెట్టెలా వున్న గదిలో కూర్చున్న జయరాం—పాతికరూపాయల ఫురెన్ స్వెటర్లో నోట్లో పైపుతో కూర్చున్న జయరాం ఈ వర్షపు రోజున వాళ్ళు చేసే పనులే ఎంటర్ టెయిన్మెంటుగా చూస్తూ కూర్చున్నాడు.

ఎల్లి ఎందుకో నవ్వుతుంటోంది. తను దాన్ని చూస్తున్నానని పసిపట్టలేదు కదా! దాని నల్లని గుండ్రని బుగ్గలు సొట్టలు పడ్డాయ్. కట్టుకున్న జానెడు గుడ్డలోంచి, దాగని గ్రామీణ సౌందర్యం, చుట్టూవున్న తోటివాళ్ళల్లో ఆ వర్షపురోజున వుషారు కలిగిస్తోంది.

జయరాం మనస్సులో ఏదో తెలియని భావం, నిరుత్సాహం ప్రవేశించింది! ఈ ఆడవాళ్ళని ఇంత అందంగా సృష్టించిన దేవుణ్ణి ఏమనాలో తోచటంలేదు! తనకి నరకయాతనగా వుంది ఇంట్లో, ఈ సునందతో తను జన్మంతా నిస్పృహలో గడపాల్సిందేనా? తనఖర్మ కెవరేం చేస్తారు.

సునందా అంటే ఎంత అందం కన్పించింది ఆ రోజుల్లో! తన కళ్ళని తనే నమ్మలేనంత అందంగా వుండేది! లేత జాజి తీగ లాంటి శరీరం! కొత్తరత్నంలాంటి సొగసు! అబ్బ! ఏదన్నా అంటే నా అందాన్ని నాశనం చేసింది నువ్వే అంటుంది! ఏం లాభం! బొత్తిగా దుర్బలశరీరమైంది దానిది. ఎప్పుడూ మూలుగుతూ ముక్కుతూ వుంటుంది చలికాలం, ఎండాకాలం, వానాకాలం, ఎప్పుడూ ఏ ఋతువూ కూడా రోగం లేనిది వుండదు. దానికి, ఇంత సిరిసంపద కలిగివుండి కూడా ఆరోగ్యమైన శరీరం అవలేదు దానిది. ఎప్పుడూ ఏదో రోగం. ఇప్పుడిప్పుడు అనుమానరోగంకూడా పట్టుకుంది.

సునందా స్తమాను తన ఎదురుగా కూర్చొంటుంది. పోనీ కూర్చున్నా ఏవేవో సూటిపోటి మాటలతో బాధపెడుతుంది. దాన్ని చూస్తూకూర్చుంటే దానిమాటలు వింటుంటే నాకూ కూడా ఏదయినా రోగం పట్టుకుంటుందేమో అని భయమేస్తుంది. తొలి రోజుల్లోలా ఆడుతూ పాడుతూ గడుపుదామంటే దానికి శరీరదుర్బలత! తను కూడా రాదు. తనొక్కడూ బయలుదేరితే అనుమానం! ఇంటికి వచ్చేసరికి లేనిపోని మాటలతో పీక్కుతింటుంది. అసలు దీన్ని చేసుకోవటంతోనే తన మనశ్శాంతికి తర్పణం వదిలినట్లయింది. తన జన్మ దుఃఖపూరితమైంది. తనకి సుఖపడే యోగ్యత నుదుట వ్రాయలేదు. భగవంతుడు! అంతకన్నా ఈ మేడలు మిద్దెలూ వదిలి ఏ రిక్షాయేనా లాగుకుంటే నయం! మనశ్శాంతి నివ్వలేని భోగభాగ్యాలు ఎవరికి కావాలి! ఆ రిక్షా వాళ్ళు నయం తనకన్నా. చీకుచింతా లేని జీవితాలు వాళ్ళవి. ఇంటికెళ్ళే సరికి భార్యలు ఎంతో ఆదరంతో మాట్లాడుతారు. పిల్లా జల్లా దగ్గరికి చేరతారు. హాయిగా అప్పిగాడి దగ్గర ఒక అణా ఎల్లి దగ్గర పాతిక కొనుక్కొని వాళ్ళతో పిచ్చి పిచ్చి కబుర్లతో కాలక్షేపం చేస్తారు బస్సు వచ్చేదాకా. బస్సు వస్తే బేరాలు తగుల్తాయ్ వాళ్ళకి. ఎల్లమ్మ కిటికీ వేపు చూడనప్పుడల్లా ఎల్లమ్మకేసి చూస్తూ కూర్చున్నాడు జయరాం......

* * *

“అబ్బ. ఒకటే వాన. ఎదవది! చలి పుడ్తోంది! ఇంత పొద్దెక్కినా ఇయ్యాలింకా బస్సు రాలేదేం చెప్మా! బస్సు వస్తే సగానికి సగం పొత్తులు ఎగిరిపోతయ్. అప్పుడు మిగిలినవి కాల్చుకోవచ్చును. ముందస్తుగా కాలిస్తే రేపటికి మిగిలితే బాగోవు. ఆ రెడ్డిగారు పొలంలో కాపేసినారు. ఇంక రానీరు. ఎల్లానో ఏమో. ఇంట్లో ఆడివోరసా అదో రకం. ఎదవసచ్చినోడు. ఇంట్లో గుంగనాగ కూకుంటాడు. ఏ రిచ్చాయినా నాగకూడదా! అంటే “ఈ శరీరం కట్టాని కొప్పదే” అంటాడు. ఎటో! అన్నగాడుకని ఇచ్చింది. ఇచ్చినందుకు రెండు తులాల బంగారం అరాయింపు చేసినాడు. ఇంటికెల్లేటలికి నోరు తెరుచుకు కూకుంటే నా నేట పెసెదికి నిన్న

రాత్రి కూడు లేనే లేదు. ఇప్పుడే పొత్తులు తెల్లి పోవాలి. ఓ రూపా డబ్బులు నూకగింజ కొనుక్కొని గంజి కాచుకోవాలి. మిగతాయి పండిలి కొల్చి కుర్రాళ్ళు ఆడుకునే పోటి కట్లు కొత్తే కుర్రోళ్ళంతా ఎగబడిపోతరు" అనుకుంది ఎల్లమ్మ. రివ్వుమని చలిగాలి వీచింది. ఎల్లమ్మ ప్రాణం గిజగిజలాడింది.

"ఏరో! అప్పన్న మావా! కునిగ్నె టనీలు పోయ్యి! కడుపు గిజగిజ లాడుతున్నది. దిక్కుమాలిన పలికి" అని కేకేసింది.

"రెండు పొత్తులిట్టా పడెయ్యి ఇసాను. కదు" అన్నాడు అప్పిగాడు. తడిసిన రూపాలు పిండుకుంటూ. ఎల్లమ్మ రెండు పొత్తులు తెచ్చిచ్చింది.

"రెండు పొగ్గలియ్యి మావా! నిప్పు చల్లారిపోనాది" అంది ఎల్లి.

"ఏటే! ఎల్లెల్లు. రెడ్డిగారి పొలంలో పొత్తులూ, ఈస నా పొగ్గులూ నీకుడబ్బులా? పొగ్గుల కుంట మయిదణాలు. కొన లేక పసుంటే' అన్నాడు అప్పన్న.

"అటాగంటవేరా? మాంగ పచ్చినోడా! నీకు నోట్లో ఎప్పుడు నీవంటే అప్పుడు పొగాకు తుంపు ఇయ్యలా నేను! వచ్చేపొద్దు రెండణాలు తెచ్చుకున్నాను. అప్పుడే నీకంద సగం అయిపోనాది. సిగ్గులేనోడా!" అంది రుసరుసలాడుతూ.

"ఒరయ్యా! మీరిట్టా కొట్టుకుంటూ కూర్చోండి. బస్సు వచ్చేసినాది" అన్నారు రిక్షావాళ్ళు.

ఎల్లమ్మ గబగబా పమిట బిగించి ఇవతలికి వచ్చింది. వెనకగా అప్పన్న వచ్చేశాడు. రిక్షావాళ్ళు హుషారుగా ఈలలు వేస్తూ తప్పట్లు కొట్టారు. ఎల్లమ్మ మొహం జేవురించింది. అప్పన్న వెక్కిరింతగా చూశాడు వాళ్ళవంక. "ఏంట్రా అదేం వెధవాయిల్లారా?" అన్నాడు. "అది కాదల్లా! మీరిద్దరూ అట్టా కొట్టుకుంటూ కూర్చోవటంతో ఓ తాపేసుకుని ఓ ఒళ్ళేలు తెగదీయండ్రా. ఎల్లిని ఇడ్లీలు వెయ్యమను. నవ్వు "టీ" చెయ్యి. సరిపోతాది" అన్నాడో రిక్షావాడు.

"ఒరయ్యా! మాటలు తిన్నగా రానీ! మా మూరేను విన్నాడంటే ముక్కు తెరగడం తాదు" అంది ఎల్లి మూతి సాగుచేసి.

"ఏటే! ఎల్లీ! కబుర్లాడుతావు మహా! పంతేసి కూడెట్టలేనోడు. నవ్వు పెట్టేవోణ్ణి మూసుకుంటే తంతాడా! ఎలా తంతాడో చూస్తాగా! నీ కష్టం తినేదికాక తన్నటం కూడానా ఎదవమొగనికి?" అన్నాడు దర్జాగా అప్పన్న తను మహారాజైనట్టు. ఎల్లి తనిచ్చే మహారాజత్వాన్ని కొలదన్నట్టు

ప్రతిమలు కూడా ప్రతిష్ఠింతురా” అని అడిగినాడు.

“చనిపోయినవారికే ప్రతిమ ఉండవు. స్వర్గస్థుల ప్రతిమలే నిలుపుతారు” అన్నాడు దేవకులికుడు. అని అంతటితో ఆగలేదు. “అయ్యా ఎంతసేపూ ఆ మొదటి మూడు ప్రతిమలను గూర్చి అడుగుతావిదేమి అన్యాయము? మూడు—స్త్రీశుల్కం కోసం రాజ్యభారంతో పాటు ప్రాణాలను కూడా తీసుకున్న దశరథ మహారాజశేఖరుని ప్రతిమ—దీనిని ప్రశ్నింపవేమిటయ్యా కారణము?” అని దేవకులికుడు డొక్క చిట్లునట్లు వేసిన ప్రశ్నము భరతుని గుండెపై పిడుగుపాటయినది “హా—తండ్రీ” అని మూర్ఛితుడై నిలువునా కుప్పకూలిపోయినాడు. అతని పాతనిహతికి మొదలంట గూలు మహావృక్షముగనే ఆ యువరాజు పడిపోయినాడు. దేవకులికుడు చకితుడైనాడు.

ఇలా మోహగతుడయిన భరతుడు కొంతసేపటికి తెప్పరిల్లినాడు. నీచమైన శుల్కశబ్దం ఆయనను హృదయశల్యమై బాధించింది. అది తనకే తగులుతుందేమోనని భంగిపోయినాడు. “ఆర్యా” అని నిట్టూర్చినాడు.

‘కైకేయీ కుమారులు భరతులు మీరేనా’ అని దేవకులికుడు అడిగినాడు.

“ఆర్యా, దశరథకుమారుడను భరతుడను నేనే” అన్నాడు భరతుడు.

“అయ్యా—మహారాజులుంగారు వెళ్ళిపోయినారు. సీతాలక్ష్మణులతో శ్రీరాములవారు అరణ్యాలకు ఎందుకు వెళ్ళిపోయినారో అంతా అగమ్యగోచరముగా ఉన్నది” అని దేవకులికుడు రామవనవాస వార్తనుగూడ తెలిపినాడు

ఇందుకే భరతుడు మరల మూర్ఛిల్లినాడు. కొంతతడవునకు తేరిడిల్లి గతజలమైన ఏటికి తృష్ణాతురునివలె నేను పట్టిపోయిన అయోధ్యకు పయనమౌతున్నాను.” అని దుఃఖిల్లినాడు. దేవకులికుడు కోరిక ప్రకారము వాటిల్లిన యావత్తు సర్వము నివేదించినాడు. దుర్భర మహాదుఃఖమును సహింపలేక భరతుడు మూర్ఛలో మునిగినాడు.

అప్పుడు ప్రతిమాగృహమునకు దశరథ మహారాజ ప్రతిమాదర్శనమునకై రాణులు సుమంత్రుని నిర్దేశమున వచ్చినారు. సుమంత్రుడు దూరమునుండి చూచి ఎవరో భూపాలుడిక్కడ పడియున్నాడని రాణులను నివారించినాడు. “ఎవ్వరో అనే సందేహం ఎందుకు, అతడు భరతుడు.” అన్నాడు దేవకులికుడు.

ముగ్గురమ్మలు చుట్టుముట్టగా భరతుడు తేరుకొన్నాడు. అమ్మలకు అభివాదనము చేయుమన్నాడు సుమంత్రుడు. కౌసల్యా సుమిత్రలకు వందన మాచరించిన భరతుడు కైకేయీదేవికి నమస్కరింప మనస్కరిం

# ★ ప్రతిమ ★

పకపకా వసముగా తృణీకరించినాడు.

“మా అమ్మలైన కౌసల్యా సుమిత్రల నడుమ నీవు పవిత్రమైన గంగా యమునా తరంగిణుల మధ్య దుర్గంధ కుల్యగానె దాపురించినావు ఛీ—పాపురాలా” అని దారుణంగా తిట్టినాడు.

కైకేయీదేవి శాంతచిత్తయై అట్టే నిలచినది. “నాయనా—నేనేమి పాపము చేసినానయ్యా” అని అనునయించి అడిగినది.

“ఇంకా ఏమి చేయాలి—నా తలకు అప్రతిష్ఠను, నా అన్నకు నారచీరలు కట్టినావు. నా తండ్రిగారికి గృహామరణము, సౌమిత్రికి అరణ్యక్లేశము కలిగించినావు నా తల్లులిద్దరిని దుఃఖసాగరంలో ముంచియుంచినావు. అయోధ్యామహామండలమంతటా కన్నీటి మున్నీటి కెరటాలు సృజించినావు. కుసుమసుకుమారి అయిన కోడలిని మహోగ్ర కాంతారాల మధ్యపడి ఉండమని పంపివేసినావు. సర్వజగత్తు మహాగుణాలని తెగడేటట్లు చేసుకున్నావు ఛీ” అని ఆవేశపడినాడు

‘మర్యాదను అతిక్రమించని నా నాయనవు—అమ్మకు మొక్కనయ్యా’ అన్నది కౌసల్య.

“అమ్మా! నీవే ఇక నాకు అమ్మవు” అని—భరతుడు మరల కౌసల్యకు పాదాభివందనము చేసినాడు. “ఈ కైక మాకు తల్లియే కాని, నేను కాదు. పాపిష్ఠుడై నీతిదూరుడైననాడు కుమారుడైనాసరే అపుత్రదోషం పట్టించి వదిలివేస్తారుగదా. అలాగే దైవసమానుడైన భర్తను అపహాస్యపాలు చేసిన కైకకు కూడా అమాతృదోషం పట్టించాలి. ఇది నా నిశ్చయము. నేను ప్రపంచమున ఇదే నూతన

> ఆమె: (షాపు వాడితో) ఆచీర ఖరీదెంత?
>
> షాపువాడు: ఇరవైరూపాయలమ్మా.
>
> ఆమె: అమ్మయ్యో; సరే అద్దాలబీరువాలోని ఆ ఎర్రచీర ఖరీదెంత?
>
> షాపువాడు: రెండు అమ్మయ్యోలు.
>
> —డి. లక్ష్మీనారాయణ పంతులు, కొమరగిరిపట్నం.

ధర్మం నేటినుండీ ప్రతిష్ఠిస్తున్నాను.” అని భరతుడు గర్జించినాడు.

అంతులేని దీనాస్యయైన కైకేయి “నాయనా మహారాజులుంగారి సత్యవచన వ్యాఘాతం కలుగనీయడం ఇష్టంలేక శుల్కం కోరానయ్యా” అన్నది.

‘ఏమిటి ఆ అడిగింది’ అన్నాడు రోషజ్వాలలు చిమ్ముతూ పుత్రుడు.

‘నా కొడుకు చక్రవర్తి కావాలని’ అన్నది కైక.

“అయితే ఆర్యుడు నీకు ఏమవుతాడనుకున్నావు? నా తండ్రికి అతను కొడుకు కాడా? యువరాజపట్టం కట్టడం అక్రమమా? మా అన్నదమ్ములంతా ఒకలాగే వర్తిల్లడం లేదా? ఆయనే రాజు అయితే నేను ఎంతో ఎంతో సంతోషించనా?” అని ప్రశ్నలు భరతుడు అడిగినాడు.

“మరి నేను శుల్కం అడగాలికదయ్యా” అన్నది కైక.

“శుల్కం! అయితే రాజ్యభ్రష్టుడై, నారచీరలు ధరించి పతితో పాటు అరణ్యవాసం చేయుమని ఆర్యుని అడవులపాలు చేసినవే. ఇది శుల్కంలో అంశమేనా” అని ప్రశ్నించినాడు భరతుడు.

“నాయనా—నీవు ఆవేశంలో ఉన్నావు. చెప్పదగినప్పుడు నీకు అంతా చెబుతాను” అని మాత్రము కైకమ్మ సమాధానము చెప్పినది.

‘ఈ మహాపవాదము తెచ్చిపెట్టి నాకు మనస్సంక్షోభము కల్గించినావు. రాజ్యకాంక్ష నీకోరయితే నా పేరు ఎందుకు చెప్పినట్లు? నీకు ఏ ఐశ్వర్యం కావలసినా ఇచ్చే మహారాజుండగా ఏమిటి నీకీ భ్రమ? రాజమాత అనిపించుకోవాలనుకుంటె ఆర్యుడు నీకొడుకు కాడా? అయ్యో ఎంతపనిచేసినావు—రాజ్యలోభంతో మహారాజును పొట్టబెట్టుకొన్నావు—నా అన్నను కీకారణ్యాలకు పొమ్మని వెళ్ళగొట్టినావు. విధివిలాసాన నిబంధాలు పెనుబండలైనాయేమో! నారచీరలు ధరించిన కోడలిని చూసికూడా కరిగిపోలేదు. ఛీఛీ” అని భరతుడు కన్నతల్లిని ఛీ కొట్టినాడు.

అంతట సుమంత్రుడు ప్రవేశించినాడు. “నాయనా భరతా, గోపకులు లేని గోకులం వలె భూపతులు లేని భూగిపాల రాజ్యం రక్షణలేక నాశనం అయిపోతుంది. ఇప్పుడు వశిష్ఠ వామదేవులు నీ అభిషేకానికి ఆయత్తులై ప్రకృతులను వెంటగొనివచ్చినారు” అన్నాడు.

“నాయనా నేను వెడుతున్నాను” అన్నాడు భరతుడు.

“అభిషేకము వదలి ఎక్కడికప్పుడీ ప్రయాణం” అని సుమంత్రుడు పృచ్ఛ చేసినాడు.

‘అభిషేకమా! అమ్మగారికి చేయండి—” అన్నాడు కైకేయీ పుత్రుడు.



"లక్ష్మణ ప్రియుడుండెడిచో అదినాకు అయోధ్య. ఆయనలేని అయోధ్య నాకు అయోధ్య కాదు. అడవి. ఇప్పుడా అరణ్యం కూడా అయోధ్యయే. నేను అక్కడికే పోతున్నాను." అని భరత కుమారుడు బయలు దేరినాడు.

## చతుర్థ

ఇలా అమ్మనీ, అమ్మ దుష్టచేష్టితాన్ని నిరసించిన భరతుడు సుమంత్రునితో కూడి రథారూఢుడై తపోవనం ప్రవేశించినాడు. సౌభ్రాత్రమూర్తిగొన్న ఆయుష్మంతుడు భరతుని నిర్వేదానికి సుమంత్రుడు సంతసించినాడు.

ఇప్పుడు వీరిరువురూ మునిజనారణ్యంలో శ్రీరామాశ్రమం చేరువకు చేరుకొన్నారు. సాంతంతుకగు ఆ మహనీయుని దర్శనానందముతో బాటు దుఃఖోద్వేగము కూడ భరతునిలో పెల్లుబుకుతూ ఉన్నది. "తండ్రీ పూజనీయులైన అన్నగారి ఆశ్రమం ఇంకా ఎంతదూరం? నాతల్లి ఇష్టప్రకారం రాజ్యరమను సైత విడచి వచ్చిన ఆ ఇక్ష్వాకుకుల తిలకుడుండే దింకెక్కడ?" అని భరతుడా వేగముతో అడిగినాడు. 'నాయనా సత్యము, శీలము, భక్తి మూర్తిగొన్న శ్రీరామ సీతాలక్ష్మణులు వర్తిల్లే ఆశ్రమపదం అదే నయ్యా" అని చేరువ కుటీరము చూపినాడు.

రథము నాపి భరతసుమంత్రు లిరువురూ ఆశ్రమద్వారం చేరినారు.

"నాయనా రాజ్యలోభి అయిన కైకేయి కన్నకొడుకు వచ్చినాడని అన్నగారికి నివేదించు" అన్నాడు భరతుడు.

మాతృదేవతాపవాదం పుత్రులకు పాడి కాదన్నాడు సుమంత్రుడు.

"నిజమే. ఇక్ష్వాకువంశమునకు కళంకభూతుడనైన నేను వచ్చినట్లు చెప్పండి" అన్నాడు మళ్ళీ భరతుడు.

అందుపై సుమంత్రుడు అందుకొల్ల నన్నాడు. 'భరతుడు వచ్చినాడు' అని మాత్రమే విన్నవిస్తాను అన్నాడు.

భరతుడిప్పుడు మరల ఉద్వేగము నొందినాడు. "నాయనా బ్రహ్మహత్యా పాతకమున బడ్డవారికి కూడా గురుచేత నివేదన లేదు కదా. మీరు ఉండండి నేనే విన్నవిస్తాను" అన్నారు.

"పూజ్యులైన అన్నగారికి శ్రీరామభద్రునికి - ఖలుడు, పాపకుడు, నిర్దయుడు, కృతఘ్నుడు అయినా భక్తిమంతుడు అయిన వాడు ఒక్కడు గృహద్వారంలో వేచి ఉన్నాడు. కటాక్షించి దర్శనమిప్పిస్తారా? లేక వెళ్ళిపొమ్మంటారా? దయాసాగరులు దయచేయండి" అని ఎలుగెత్తి పిలచినాడు.

ఆశ్రమవనంలో జానకీ సౌమిత్రి పరివేష్టితుడైన శ్రీరామునికి ఈ ఉరుమువంటి కంఠస్వరం స్ఫుటంగా వినిపించినది.

"సీతా! లక్ష్మణా! విన్నారా! నాయన గారి కంఠస్వరాన్ని పోలినది బంధుత్వసందేహ బంధురమై ఎవరిదో పిలుపు ఇప్పుడు వినిపించినది. ఎంత ఆప్యాయమో, ఆత్మీయమో తీయమో ఆ పిలుపు విన్నారా" అని వర్షపులకాంకితుడై శ్రీరాముడు అడిగినాడు. లక్ష్మణుడును అట్టి ఆనందమునే పొందినాడు. బాంధవుని కంఠస్వరమే యని నిశ్చయించుకున్నాడు. ఆర్యుని అనతిని ఆశ్రమ పథముదాటి వచ్చి చూచినాడు.

(సశేషం)

# బడిలో అలజడి



త్రిమూర్తుల్లో బ్రహ్మదేవునికి గుడి, ముగురమ్మల్లో సరస్వతికి కూడా ప్రత్యేకంగా ఆలయం వున్నట్టు కనిపించదు. అందుకు కొరత చింతించవలసిన గూడా లేదు. ఎందుకంటే వేదాది విద్యలు ఆమెకు విహారస్థలాలయె. ముదంత అమెనుతం [illegible] పుస్తకం చేబట్టని వాళ్ళకు లేదాయె. పైగా ఆ రోజుల్లో సాధారణంగా బడుల్లోనే జరిగేవి [illegible]. పండితుడు, ఆదర్శప్రాయుడూ అయిన గురువు. [illegible] శిష్యులు. పవిత్రమైన ఆవరణ. ప్రశాంతమైన వాతావరణం. అక్కడి శారదాదేవి కాపురం నిత్యకల్యాణం, పచ్చతోరణంగా సాగిపోతుండేది.

ప్రస్తుతానికి వస్తే యివి బడి [illegible] భావింపబడుతున్న రోజులు కావు. బడిలో అలజడి చెలరేగుతున్న రోజులు.

ఈ అలజడి ఎలా వచ్చింది? ఎందుకు వచ్చింది? అన్న ప్రశ్నలు ఈనాడు విజ్ఞుల్ని వేధిస్తున్నాయి.

పదిమంది ఒకచోట సమావేశమైతే మాట్లాడుకోదగిన - విచిత్రమైన యథార్థ సంఘటనలతో జోడించి చెప్పుకోదగిన - సమావిషయాల్లో ఈ బడిలోని అలజడి కూడా ఒకటిగా పరిణమించింది.

పాఠశాలను అంగిగా తీసుకుంటే దానికి అంగాలు మూడు. ఒకటి - బోధకుడు. రెండు - బోధితుడు. మూడు - బోధింపబడుతున్న విద్య.

కానైతే దుష్టాంగాన్ని ఛేదించి మిగిలిన కాలంనాడు యుద్ధానికి వెళ్లడం ఘనమైన విషయం. అలా వెళ్ళేవాడిని వీరుడనీ ధీరుడనీ కొనియాడేవారు. వెళ్లినవాడు చల్లగా తిరిగి రావాలని దండాలు పెట్టుకొనేవారు ఆప్తులు. ఈనాడు ఆ ఘనత కొంత ఉపాధ్యాయులకు అబ్బినట్టు కనబడుతోంది.

పరీక్షలలో వాచర్ గా సూపరింటెండెంట్ గా వెళ్లడం ఇంచుమించు యుద్ధరంగానికి వెళ్లడం లాగే వుంది. అలా వెళ్లిన టీచరు దెబ్బలు తినడం బాగా రివాజైపోతోంది. మొన్న స్కూలు ఫైనలు పరీక్షలకు మదనపల్లిలో 400 మంది విద్యార్థులు పరీక్షాకేంద్రం మీదకు దండయాత్ర చేశారు. ఇలాటి వార్తలు ఏటేటా మార్చి ఏప్రిల్ నెలలలో మామూలు అయిపోయాయి. ఎప్పటికప్పుడు లాంఛనానికో మాటు హరా అన్నా అనుకోవడం కూడా రివాజైపోయింది. జరిగేవి జరుగుతూనే ఉన్నాయి. కట్టుదిట్టమైన కట్టుదిట్టాలు ఏర్పాటు కావడం లేదు. దానాదీనా, బడులలో పిల్లలకు కూడా చదువంటే అలుసు, మాస్టరంటే లోకువా, మహా అయితే జాలి కలుగుతున్నాయి తప్ప భయభక్తులు గౌరవం లేవు. ఈ వ్యాసంలో ఉపాధ్యాయుడి దృష్టిలోంచి నేటి స్థితిగతులను చర్చించడం జరిగింది.

# ఎడ్యుకేషన్ ఎలా ఉన్నా సరే

...ఈ కాలం ఎడ్యుకేషన్ ఎవరి చేతుల్లో ఉందో తెలియని కాలం. ఒకటి: గవర్నమెంటు! వారిని గ్రాంటు కోరకుండా ఉంటే వారికి చాలు; 'ఎడ్యుకేషన్ ఎల్లా ఉన్నా సరే. రెండు: వారి తరఫు ఏజెంటు-అనగా ఇన్‌స్పెక్టరు. కొత్త పద్ధతులూ, పాఠాల లిస్టూ ఉంటే ఆయనకి చాలు— ఎడ్యుకేషన్ ఎల్లా ఉన్నా సరే. మూడు: మేష్టరు! ఈయనకి ఒకటో తారీఖు ఆ రోజున జీతంరాళ్లూ సరిగ్గా ఉంటేచాలు ఎడ్యుకేషన్ ఎల్లా ఉన్నా సరే. అయిదు: విద్యార్థి తండ్రి! అతగానికి వాళ్ల అబ్బాయి ఆ క్లాసు మెట్టూదాటి మేష్టరు కటాక్షం వల్ల పై క్లాసులో పడితే చాలు. ఎడ్యుకేషను ఎలా ఉన్నా సరే. ఆరు: ఇతరులు! ఈ ఇతరులకీ ఏమీ అక్కర్లేదు. ఇప్పుడంతా నాన్సెన్సు, పాడయిపోయింది. తమరు చిన్నప్పుడు చదివిన చదువే చదువంటారు...

* * *

కడమవృత్తులు పెద్దవాళ్ళతో పని. మేష్టరీ అంటే అజ్ఞానంతో ప్రమేయం. పాపం ఒకాయన ఒళ్లు మండిపోయిగావును "మీరేం చేస్తున్నారండీ" అని అడిగితే, 'దూడల్ని కాస్తున్నానండీ' అన్నాట్ట. అజ్ఞానితో ఏమి హెచ్చుతగ్గు వచ్చినా జ్ఞానిదే తప్పు...(మేష్టరు) జ్ఞానానికి విలవ బాలుడు కట్టలేడు; కట్టగల తండ్రి వగైరాలు అప్పుడు అక్కడ ఉండరు. అందుకని బోధన అమూల్యం. కడమవృత్తులు ఒక్కడి పనే. బోధన, ఇద్దరి తెలివితేటల వ్యవసాయం. ఉమ్మడి వ్యాపారాలలో ఎప్పుడు మాట దక్కడిసిందికి మేష్టరు, తన తెలివిగల కుర్రాడికి తెలిసిందనీ, కుర్రాడు తనలో తెలివిగల ప్రమాణం సిద్ధించిందనీను. పైగా తెలిసిందా కా బ్రహ్మవిద్య. కొన్నాళ్లయింతరవాత, అందుకనే కొందరికి తమరి చిన్నతనంలో మేష్టరు తమరికి చెప్పేడిసిం దేమిటి, అనిపిస్తుంది. కాని, ఆ గురువు మాత్రం ఆ క్లాసుకే జీవితం యావత్తూ బోధచేస్తూ—అంటే క్రితంజన్మలో మేష్టరు ఒక క్లాసే తెగ ఫేలయి ఉంటాడు. అందుకనే ఈ జన్మలో అది అన్నేసేళ్లు చదవవలసి రావడం.

* * *

...(మేష్టరీ) గొర్రెతోక లాంటిది. ఇన్నీసుపేట బ్యాండులాంటిది. మన 'అపనాతివానునా లాంటిది. బంట్రోతులు ఉండరు. ఏమీ సప్లయి కావు. "రక్షి" ఏమీ ఉండదు; గొడుగేసుకోకుండా వెళ్తే సూర్యరశ్మి తప్ప. పెరిగేఖర్చులు ఆ మొద్దంకి జీతంలోనే భరించుకోవాలి. మాటాడకూడదు. మాట్లాడితే త్రికరణశుద్ధి లేకపోవడం అన్నమాట. శుభాశుభాలు ఆ జీతంలోనే, లిప్టన్ అందులోనే, ఎలిఫెంటు అందులోనే; రోగాలూ రొమ్ములూ అందులోనే; దేవుడు ఖర్చు, దెయ్యాలఖర్చు అందులోనే సంసారం అంతా అందులోనే. దేశం అందులోనే. ఆసులులేని వారసు తద్దినాలు అందులోనే; భేగాను తద్దినాలూ అందులోనే; ఒక్కటే వివాహం సాధారణంగా, పెద్దది. అన్నీ సెలవలే—ఎందుకు? ఈ సెలవు ఆలోచిస్తూ కూర్చోడానికి అంతా పిల్లలే. కాని మేష్టరీవల్ల దారిద్ర్యం అబ్బుతుందా? లేక దరిద్రుడైన తరవాతే మేష్టరీలో చేరతాడా?...ఎటు పడితే అటే వాదించవచ్చు....వెనకవాళ్లకి తీర్థపు రాచ్చిప్పల మీద ఆపేక్ష ఎందుచేత? దోమలకి మానవుల చెవులంటే సరదా ఎందుచేత? అల్లానే దారిద్ర్యానికి మేష్టరీ అంటే ఇష్టం. అందులో తెలుగు మేష్టరంటే పరమప్రీతి. అతనెపుడూ నోట్లు (ఆఫ్ లెసన్సు అంటారు వాట్ని) వ్రాస్తూ ఉండడం ఒక తార్కాణేమో అందుకు.

...మేష్టరీలో ఉన్న ఇతర లబ్ధి. ఒకటి: పుస్తకాలు చెయ్యడం పుస్తకాలు వ్రాసీ, నాటకాలు పెట్టీ కారుపేసి బాగుపడ్డవాళ్లు ఒకరు అరుదు. పుస్తకాల వ్రాతలకి ఒకచో కోరు దర్శనం కూడా అవుతోంది. రెండు: పెద్ద పరీక్షల పేపర్లు దిద్దడం. అది సౌఖ్యమో యమయాతనో చెప్పడం కష్టం. జీవితంలో ఒకసారి పడ్డ మేష్టరు మళ్లీ పడడు సాధారణంగా మసిపగంలాగ, అదేనా యావన్మందికీ అందుతుందా? దానికెన్ని మారాములు? బ్రాహ్మణా బ్రాహ్మణ సమస్య; అందులో ఏముంది కాని ఉత్తరాది దక్షిణాది సమస్య తీవ్రంగా ఉంది. ఉత్తరాదిఅంటే సిఫారసు ఉత్తరాలు వగైరా; దక్షిణాది అంటే దానో పాదిమం గిరా కొందరికి అయితేం? మూడు: పరీక్షలకి సూపరింటు అవడం. రెండు మూడు రోజుల కూలి నాలుగైదు మాసాలలో పొందడం. ఈలోపున హెచ్చుతగ్గు పరిశోధనలు చేస్తే వెంటనే దవడనుగ్గి, ఇంకా పైనుండి మేడలాంటివి దిగవలసివస్తే దేహశుద్ధి రుచి చూస్తాం...

నానాజాతులూ, నానావర్ణాలూ, నానా భేదాలూ గల నానా సాహేబులు నలభైయేసి (పైవారి ఒప్పుకోలుమీద నూటభైయేసి) మంది అజ్ఞానులు ఉన్న తరగతులు—ఒకటవ, రెండవ, మూడవ, నాల్గవ సంవత్సరం ఆ తరగతే ఎందుకురా ఇదీ అని ఉసూరుమని ఈసురోమంటే పిల్లలుగల తరగతులు — మార్కుల పెంట, పరీక్షలగోడవ, ప్యాసుల ఆదుర్దా, గుమాస్తాగిరీ పరమావధిగల తరగతులు — చొక్కాలు విప్పితే ఎముకల పోగులుగా ఉండే ఆత్మకవిత లేక, సౌశీల్యం ఎప్పుడు టాంకి తోడుకోక, గంట కిద్దరు మేష్టర్లని చూసే పిల్లలుగల తరగతులు — స్వభాషకి దూరాన్ని పడి అన్యభాష అందుకోడానికి అర్హతలేని పిల్లలుగల తరగతులు - ఉంటూన్న ఈ దేశంలో ఏ మెథడ్ పెట్టి చదివితే బోధన జరుగుతుందో తెలుసుకోడం మాటలు కాదు.

—భమిడిపాటి కామేశ్వరరావుగారి వాక్యాలు.

---

## బడిలో అలజడి

—జిల్లాబోర్డుకు జిల్లావ్యాప్తంగా పల్లెల్లో, పేటల్లో, పట్టణాల్లో పాఠశాలలుంటాయి. వీటి ఒక ప్రాంతినిబట్టి కొత్తవారికి కూడా అవకాశాలు చూపెట్టబడుతాయి. వృత్తిలో ప్రవేశించిన కొంతకాలానికే ఉపాధ్యాయుడు తన ఆదర్శాలకు చాలా అవరోధాలున్నాయన్న వాస్తవాన్ని తెలుసుకోగలుగుతాడు. చక్కగా పాఠాలు బోధించడమొకటే తన కర్తవ్యమని భ్రమపడాడింతవరకూ! ప్రాథమికోపాధ్యాయుడైతే కార్డులు వ్రాసి పెట్టాలి. ప్రానోటు వ్రాయాలి. క్రమశిక్షణ 'మెయింటెయిన్' చేయాలన్న కక్కుర్తికి పాల్పడేవాడైతే కుర్రవాళ్ళల్లో ఎవరిని దండించాలి, ఎవరిని దండించకూడదు అన్న విచక్షణాజ్ఞానం కలిగివుండాలి. గ్రామపెద్దల్లో ఎవరొస్తే పైకి లేవాలో, ఎవరికి కుర్చీ యివ్వాలో, ఎవరిని తరచుగా దర్శించి వినయాలు ప్రదర్శించుకోవాలో తెలుసుకుని వుండాలి. ఇక గ్రామంలో కక్షలున్నట్టయితే ఉపాధ్యాయుడి పరిస్థితి అడకత్తెరలో పోకలా తయారయ్యే ప్రమాదం కద్దు! తటస్థ విధానాలు సుతరామూ పనికిరావు. అటో యిటో తేల్చుకోమంటారు. ఏదైనా ముప్పుమాత్రం పంతులయ్యకే! రకరకాల సంతకాలతో, వివిధ పరిమాణాల ఎడమచేతి బొటనవ్రేలి గుర్తులతో ఆ హాజర్లు ప్రభవించి పైవారిని దర్శిస్తుంటాయి. అధికారులేం చేయగలరు? ఉపాధ్యాయుణ్ణి ఈ బెడదలోనుంచి తప్పించాలన్న సదుద్దేశంతో అతణ్ణి మరోచోటుకు బదిలీ చేసి తమ బాధ్యతను తెరవేసుకుంటారు.

మళ్ళీ క్రొత్త పరిస్థితులతో సర్దుబాటు పడవలసివస్తుంది ఉపాధ్యాయుడు. గృహ సమస్య. పరపతి సమస్య. ఎంతో కృషి చేసి

# అల్లరికి అసలు కారణం

బల్లలమీద డప్పులదప్పుళ్లు, పిలి కూతలు, ఈలలు, తెలుగు సినిమాలోని ప్రేమ గీతం అమోఘ మేహాయా అని సానుభూతి కేకలు...

అది చేపల మార్కెట్ కాదు, నాలుగు రోడ్ల కూడలి కాదు, మధ్యలో రీలు తెగిపోతే గందరగోళంగా ఉన్న సినిమా హాలు కాదు. కాలేజీలో క్లాసురూము.

హిస్టరీ లెక్చరరు ఏ క్షణానయినా హిస్టరీ రికార్డులోకి వెళ్ళిపోయే స్థితిలో ఉన్నాడు. కన్నీళ్ళు ఆపుకుంటున్నట్లు కనిపిస్తున్నాడు. హృదయ విదారకమైన దృశ్యం. ఆయన మంచి లెక్చరరు కాకపోవచ్చుగాని మంచిమనిషి. అతి మంచివాడు అమాయకుడుగా, అసమర్థుడుగా జమ కట్టబడేటంత మంచివాడు. అమితమైన తనమే ఆయనకు ప్రాణాంతకంగా తయారైంది. అప్పుడప్పుడు ఉషారుగా మాటాడి నవ్వించగలడు కాని పాఠం చెబుతున్నప్పుడు బిగుసుకుపోతాడు. విషయం బోధపడనట్లు కొట్టుకుంటుంది అప్పచెబుతున్నట్లు చెబుతాడు.

* * *

అదే క్లాసురూములో తరువాతి పీరియడ్‌లో ఇంగ్లీషు లెక్చరరు షేక్స్పియరు చెబుతున్నాడు. కొంతసేపు చీమ చిటుక్కుమంటే చెవులు బద్దలయేంత నిశ్శబ్దంగా ఉంది. అల్లరి కుర్రాళ్లని పేరుపడినవాళ్లు, పాఠం వినడం మానుకుని మాయమైపోయే విద్యార్థులుకూడా కదలకుండా కూర్చుని చెవులు రిక్కించి వింటున్నారు. అంతకుముందు వాళ్ళకికూడా సరదం అర్థమైపోతోంది. ఆయన పాఠం చెబుతుంటే షేక్స్పియరు గురించే కాదు, ఛాసర్ నుంచి షెల్లీదాకా, కీట్స్ నుంచి యీట్స్‌దాకా ఎందరి రచనలో ఎన్ని విషయాలో తెలిసిపోతున్నట్లు ఉంటోంది.

* * *

పాఠం సరిగా చెప్పలేని మేష్టర్ల క్లాసులో విద్యార్థులు గోల చేస్తారని, బాగా చెప్పే మేష్టర్ల క్లాసులో నిశ్శబ్దంగా ఉంటారని, తప్పంతా ఉపాధ్యాయులలోనే ఉందని అనేవారు పై ఉదాహరణలు చెబుతారు.

కాని ఉపాధ్యాయులలో కొందరు పాఠాలు బాగా చెప్పలేని కారణంచేత విద్యార్థులు చేసే హద్దుమీరిన అల్లరిని సమర్థించటానికి వీలులేదు. విద్యార్థులలో ప్రగతిపు ఉత్సాహం పొంగి పొర్లిపోతున్నంత మాత్రాన విశృంఖలంగా ప్రవర్తించవలసిన పనిలేదు. కొన్ని రాజకీయ పక్షాలు తమ ప్రయోజనం కోసం విద్యార్థులను వాడుకుంటున్నంత మాత్రాన క్రమశిక్షణ లోపించవలసిన అవసరం లేదు. బడిలో అలజడి చినికి చినికి గాలివాన అవుతోంది. ఏవిధంగా చూసినా విద్యార్థుల ప్రవర్తన ఆందోళనకరంగా ఉంది.

దీనికి ఒక కారణం నేటి విద్యావిధానంలోని లోపమే అని అనుభవజ్ఞులు కొందరు చెబుతున్నారు. హైస్కూల్లో కంటే కాలేజీలో క్రమశిక్షణ లోపం ఎక్కువగా ఉంటోంది. కాలేజీ చదువులొచ్చి పిల్లల్ని చెడగొడుతున్నాయనేది ఒక సామెతగా వాడుకలోకి వచ్చింది. కాలేజీలోకి రాగానే విద్యార్థి మొనగాడైపోతున్నాడు; హైస్కూల్లో కంటే వ్యక్తి స్వేచ్ఛ ఎక్కువవుతోంది. ఉపాధ్యాయులతో సమానస్థాయిలో మాటాడటం నేర్చుకుంటున్నాడు. కాలేజీలో ఎందుకు చదువుతున్నాడో, చదివిన చదువు తరువాత జీవితంలో ఎలా పనికివస్తుందో, చదువైన తరువాత ఉద్యోగం వస్తుందో రాదో, వస్తే ఏ ఉద్యోగం వస్తుందో అతనికి తెలియదు. ఇంగ్లీషు కవులు వ్రాసినవి, తెలుగు కవులు వ్రాసినవి క్షుణ్ణంగా చదవటం, యూరపులో ఏ యుద్ధం ఎప్పుడు జరిగిందో తెలుసుకోవటం ఇవన్నీ ఏ నోట్సుబట్టో ముక్కున పెట్టుకుని పరీక్షలో వ్రాయటం తప్ప అతనికి ముందు ముందు ఎందుకు ఉపయోగపడుతుందో అతని ఊహకు అందని విషయం. అందుచేత చదివే చదువుమీద అతనికి సహజంగా ఆసక్తి ఉండదు. ఏదో కాలక్షేపానికి కాలేజీలో చదవటం జరుగుతోంది. మహా అయితే ఈ చదువే మళ్లీ ఇతరులకు అప్పచెప్పే బడిపంతులు ఉద్యోగమో, నూరు రూపాయిల గుమాస్తా ఉద్యోగమో సంపాదించుకోటానికి పనికొస్తుందేమో. ఈ చదువుమీద విద్యార్థికి గౌరవం ఎందుకుంటుంది? సరిగా చదివితే నేం, చదవకపోతే నేం? అల్లరి చేస్తేనేం, బుద్ధిగా ఉంటేనేం? చదువు అయిందనిపించుకోవటమేగా కావలసింది!

అందుకే ఈవిద్యావిధానాన్ని పూర్తిగా సంస్కరించక తప్పదని కొందరు పెద్దలు సూచిస్తున్నారు. బ్రిటిషు పరిపాలన అవసరాలను దృష్టిలో పెట్టుకుని రూపొందించిన ఈవిద్యాపద్ధతి స్వతంత్ర భారత వ్యవస్థకు పనికిరాదని అంటున్నారు. భారతదేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందటానికి ఉద్యుక్తమవుతోంది. సాంకేతిక విద్య సర్వతోముఖంగా అభివృద్ధి అయితే గాని పారిశ్రామికాభివృద్ధి సాధ్యపడదు. కనుక సాంకేతిక విద్యను పెంపొందించాలి. వృత్తి విద్యలను ప్రోత్సహించాలి. విద్యను బహుముఖాలుగా ప్రత్యేకించి శిక్షణ ఇవ్వాలి. కళలు, రాజకీయాలు, చరిత్ర, అనేక శాస్త్రాలు ఇలా సిద్ధాంత స్థాయిలో ఉండిపోతున్న విద్యను జీవితానికి ఉపయోగకరంగా దిద్దుకోవాలి. చదివే చదువు తన అభివృద్ధికి, జీవితానికి, సంఘానికి ఒక ప్రయోజనం చేకూర్చగలదనే నమ్మకం కుదిరినప్పుడే విద్యార్థికి ఆచదువుమీద గౌరవం కలుగుతుంది. ఆ గౌరవం కలిగినప్పుడు క్రమశిక్షణ, బాధ్యతగల ప్రవర్తనా అలవడతాయి. ఈచదువులన్నీ నానాకాలపు చదువులనే 'రసనభావం' పోగొట్టగలిగిన చదువే విద్యార్థికి క్రమశిక్షణ నిస్తుంది. దేశాభివృద్ధికి సహాయకారి అవుతుంది. ★

"పూర్వవిద్యార్థి"

---

అభివృద్ధి సాధించిన పాఠశాలను వదలిపెట్టి యిక్కడికి రావలసివచ్చిందిగదా అన్న విచారం. తన శ్రమకు ఫలింపు లేకపోయినందువల్ల నిరాశ. ఎప్పుడులేనిగా ఈ బ్రతుకు రాళ్ళబండికగ్గర తెలియలేదుగదా అన్న నిస్పృహ. ఇన్నింటికి పైగా ఆర్థిక సమస్య. అవసరాలు బలిసినకొద్దీ ఆదర్శాలు చిక్కిపోతుండగా ఉపాధ్యాయునిలో మంచితనం నానాటికి పోతుంది. సిలబస్ పూర్తి చేయాలి గనుక పూర్తి చేస్తాం, అల్లరిపిల్లరగా తీర్చుకుంటున్న ఉద్రేకాన్ని చూచి, ఎవరి కర్మకు ఎవరు కర్తలనుకుంటూ నిర్లిప్తత వహించడంలాంటి అలవాట్లు అతనిలో వేళ్ళూనుకపోతున్నాయి. వీటిలో మొదటిది విద్యాప్రమాణాలు పతనం కావటానికీ, రెండోది క్రమశిక్షణ శిథిలం కావటానికీ కారణాలౌతున్నాయి.

అసలు విద్యాప్రమాణాలు పతనం కాసాగిందెప్పటినుంచి? విద్యార్థులలో క్రమశిక్షణ లోపించినప్పటినుంచి! విద్యార్థిలో క్రమశిక్షణ లోపించిందెప్పుడు? తనవారి సర్వసమర్థతపైన, ఉపాధ్యాయుని అసమర్థతపైన పరిపూర్ణమైన విశ్వాసం కలిగినప్పుడు. తిమ్మిని బమ్మిగానూ, బమ్మిని తిమ్మిగానూ మార్చగల ఘటనాఘటన సమర్థులు తనకండగా వుండగా, పరీక్ష పాసు కావడంలాంటి సామాన్యమైనది మరొకటి వుండదని భావిస్తున్నాడు విద్యార్థి. భావించి అధ్యాపకుడికి

(శేషం-వ పేజీ చూడండి)

# రాశిఫలాలు

దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

11-5-60 బుధవారం మొదలు
17-5-60 మంగళవారం వరకు.

**మేషం:**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ప్రతివిషయంలోను ముందుజాగ్రత్త అవసరం. త్రిప్పట, ధనవ్యయము అధికంగా ఉంటవి. మీ స్నేహితులు కొందరు మిమ్మల్ని మాటలతో వేధించటానికి చూస్తారు. వృత్తికి సంబంధించిన కార్యకలాపాలు గౌరవప్రదంగా ఉంటవి. అయితే ఫలితం సాధారణంగానే ఉంటుంది. కుటుంబంలో ఒకరిమీద ఒకరికి ప్రేమ, ఆదరణలు లోపించగల సూచనలున్నవి. ఆదాయం మామూలుగానే ఉంటుంది. కాని, కొన్ని దుబారా ఖర్చులు పైన పడటంవల్ల శ్రమ కలిగించవలసివస్తుంది. ఇతరులకు సహాయం చేయవలసి వస్తుంది. వ్యవహారవిషయాలలో నిదానంగా ఉండటం మంచిది. 16, 17 తేదులలో శుభవార్తలు. వృత్తిలో అభివృద్ధి.

* * *

**వృషభం:**

(కృత్తిక 2, 3, 4, పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

కొన్ని సమయాలలో మీ మాటను చెల్లించుకోటానికి ఆటంకాలు వస్తవి. ఖర్చులు, బాధ్యతలు పెరుగుతవి. కార్యభారం, ఆందోళనవల్ల జ్ఞాపకశక్తి లోపిస్తుంది! అయితే పట్టుదలతో పదిమందిలో గౌరవాన్ని నిలబెట్టుకోగలుగుతారు. వృత్తివ్యాపారాలలో ఇతరులతో పోటీ పడవలసి వస్తుంది. ప్రయాణాలు చేస్తారు. కుటుంబంలో తలపెట్టిన పనులు కొంత ఆలస్యంగా జరుగుతవి. దైవకార్యాలు అనుకూలిస్తవి. వారాంతంలో అకస్మాత్తుగా బంధువులవద్దనుంచి కవ వార్తలు తెలుస్తవి. సంఘకార్యాలలో పాల్గొంటారు, ఇతరులమాటలను నమ్మి ఆత్మీయులతో కలహాలకు దిగవద్దు 12, 13 లలో విలువగల వస్తువులు కొంటారు. ధనప్రాప్తి.

* * *

**మిథునం:**

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

కొన్ని సందర్భాలలో వృథాశ్రమ చేయవలసి వస్తుంది. కాని మొత్తంమీద సంతృప్తికరమైనఫలితం పొందగలుగుతారు. నిదానము, ఓర్పు అవసరం. అధికారులవల్ల కార్యసిద్ధి లభిస్తుంది. ఈ సమయంలో విశేషంగా డబ్బు పెట్టుబడిపెట్టి చేయతగిన పనులు అనుకూలిస్తవి. సంఘంలో మీమాట బాగా చలామణి అవుతుంది. మధ్యలో కొద్దిగా అనారోగ్యం చేస్తుంది. కాని మీ కార్యకలాపాలకు ఆటంకం కలుగదు. మాట స్థిరత్వంలేని మనుషులతో స్నేహం లభిస్తుంది. జాగ్రత్తగా ఉండటం అవసరం. కుటుంబంలో సుఖసంతోషాలు లభిస్తవి. విశ్రాంతిలేని పనులు. అయితే ఉత్సాహం తగ్గదు. 16, 17 లలో కారణం తెలియని చింత. తలవనితలంపుగా ధనప్రాప్తి, బంధువులతో కలతలు.

**గ్రహస్థితి**

మేషంలో శుక్రుడు, మేషవృషభాలలో సూర్యబుధులు, సింహంలో రాహువు, ధనుస్సులో శనిగురువులు, కుంభంలో కేతువు, మీనంలో అంగారకుడు, తులా వృశ్చిక ధనుర్మకరాలలో చంద్రుడు.

* * *

**కర్కాటకం:**

(పునర్వసు 4 వ పా, పుష్యమి, ఆశ్లేష)

ప్రశాంతంగా ఉందామని మీరు ఎంత ప్రయత్నించినా ఏదో ఒకభారం పైనవచ్చి పడుతూ ఉంటుంది. దైవానుగ్రహంవల్ల జయప్రదంగా నిర్వహించగలుగుతారు. మధ్య మనుష్యులమాటలు విని ఒకరిద్దరు మిత్రులు మీతో కలహిస్తారు. కాని, నిదానంగా యథార్థం తెలుసుకోగలుగుతారు. శుభవార్తలు తెలుస్తవి. తలవనితలంపుగా ఆదాయం పెరుగుతుంది. వృత్తికి సంబంధించిన ప్రయాణాలు చేస్తారు. వృత్తి ఉద్యోగాలలో సాటివారి ఆదరాభిమానాలు లభిస్తవి. కుటుంబంలోనివారి ఆరోగ్యం సరిగా ఉండదు. క్రొత్త మనుష్యులతో స్నేహం లభిస్తుంది. కాని వారివల్ల మోసం జరుగకుండా చూచుకోవటం అవసరం. 11, 12, 13 లలో గౌరవప్రాప్తి, శుభవార్తలు.

* * *

**సింహం:**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పాదం)

ప్రతివిషయంలోను మీ అంతస్తును కాపాడుకొని అన్నిరకాల మనుష్యులతోను సమానంగా వ్యవహరించగలుగుతారు. బంధుమిత్రుల సలహా, సహాయము లభిస్తవి. ఇంతకుముందు చెప్పిన మాటను చెల్లించుకోగలుగుతారు. ఖర్చులు అధికంగా కనుపించినా తగినంత ఆదాయంలభిస్తుంది. సకుటుంబంగా ప్రయాణాలు చేయవలసి రావచ్చు. వృత్తివ్యాపారాలలో మీ ఆలోచనలు సకాలంలో నెరవేర్చుకోగలుగుతారు. ఈ సమయంలో అతిముఖ్యమైన క్రొత్తవిషయాలు తెలుసుకోగలుగుతారు. మీ మాటతీరు కార్యకలాపాల పద్ధతి కొందరిదృష్టిలో మొదట కటువుగా తోచటంవల్ల సాఫీగా మీతో కలుసుకోలేకపోవచ్చు. కాని, వారివల్లనే ముందుముందు మీకు అనుకూలత ఉంటుంది. 14, 15 లలో కలహప్రసంగాలు, శుభకార్యప్రయత్నాలు.

* * *

**కన్య:**

(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1.2 పా)

ప్రస్తుతం ఏ సందర్భంలో అంతగా ఉత్సాహం కనుపించదు ప్రతిపనిలోనూ, ఆటంకాలు, విపరీతమైన ఖర్చులు కనుపించగలవు. వృత్తిలో చికాకు అధికంగా ఉంటుంది. మీరు న్యాయంగా వ్యవహరించినా కొన్ని సందర్భాలలో వ్యతిరేకించే అవకాశాలున్నవి. మీ ఆరోగ్యంగురించి జాగ్రత్తగా ఉండటం అవసరం బాహ్యవిషయాలలో ఆడంబరం బాగానే ఉంటుంది. ధర్మకార్యాలు అనే పేరుతో ఖర్చులు పెరుగుతవి. వృత్తి ఉద్యోగాలలో ఏ సందర్భంలోనూ పొరపాట్లురాకుండా చూచుకోవటం అవసరం. సుబ్రహ్మణ్యస్తోత్రపారాయణం చేసుకోవటంవల్ల మనోధైర్యం లభిస్తుంది శత్రుబాధ తొలగుతుంది. వారాంతంలో మీకు రావలసిన ధనం చేతికి వస్తుంది. బాధ్యతలను తగ్గించుకోవటానికి ప్రయత్నించండి. 14,15 తేదీలలో ఆందోళన, కార్యభారం.

* * *

 

# రాశిఫలాలు



**తుల :**

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

ఫలితం పూర్తిగా ఉండదనే విషయం ముందుగా తెలిసికూడా ఎదుటివారి సంతృప్తి కోసం కార్యరంగంలో ప్రవేశించవలసి వస్తుంది. పదిమందిలో గౌరవం పొందగలుగుతారు. కుటుంబంలో సుఖసంతోషాలు లభిస్తవి. కాని ఖర్చులు మాత్రం బాగా పెరిగే అవకాశాలున్నవి. బంధువులకుగాని, స్నేహితులకుగాని మీ సలహా సహాయాలు అవసరం అవుతవి. సమయానుకూలంగా వ్యవహరించి నిష్ఠురాలు రాకుండా చూచుకోవండి. కోర్టు కచేరీలలో అనుకూలమైన సమయం, ప్రయాణాలు తలపెడతారు. కాని ఆటంకాలు వస్తవి. పదిమంది మిమ్ము లనుసరించి గొప్పగా చెప్పుకుంటారు. విలువగల వస్తువులకోసం ప్రయత్నాలు అనుకూలిస్తవి. 15, 16 తేదులలో విలాస వినోదాలు, శుభవార్తలు గొప్పవారితో స్నేహం.

* * *

**వృశ్చికం :**

(విశాఖ 4 వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ).

ప్రస్తుతం మీ ఆలోచనలు కార్యరూపం పొందగల అవకాశాలున్నవి. మీకు మాట ఇచ్చిన స్నేహితులు సకాలంలో సహాయం చేస్తారు. ధనాదాయం ఇంతకుముందుకన్నా బాగుంటుంది, సాధారణంగా కొన్ని సమయాలలో కలహాలు రాగల అవకాశాలున్నవి. మీ దేహ సౌఖ్యం లోపించగల సూచన లున్నవి. అయితే మీ ప్రయత్నాలు యథాప్రకారం సాగుతూ ఉంటవి. కోర్టు కచేరీలలో అనుకూలమైన సమయం. సంఘంలో పలుకుబడి పెరుగుతుంది. సొంతమైనంతవరకు మీ స్వంత కార్యకలాపాలలో ఇతరులు జోక్యం కలిగించుకోకుండా చూచుకోవండి. ఒకరిద్దరు స్నేహితులు మీ సహాయం కోరివస్తారు. కాని ప్రస్తుతం నెరవేర్చలేకపోతారు. 12, 13 లలో వృత్తిలో అభివృద్ధి, అధికారుల ప్రాపకం లభిస్తుంది.

* * *

**ధనుస్సు :**

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ పా.1)

దైవబలం బాగున్నది. మీరు పదిమంది కోసం పాటుపడి కొన్ని ముఖ్యమైన పనులు నెరవేర్చ గలుగుతారు. పోటీ ఉంటుంది. కాని ధైర్యంతో ఎదుర్కొ గలుగుతారు. ధనాదాయం కూడా బాగుంటుంది. విలాస వినోద కార్యక్రమాలలో పాల్గొంటారు. మీ ఆరోగ్యం కుటుంబంలోనివారి ఆరోగ్యం కూడా బాగుంటుంది. వారం రెండవ భాగంలో స్వల్పవిషయాలలో పట్టుదలలు పెరిగే సూచన లున్నవి. ఇతరులవద్దనుంచి రావలసిన ధనం చేతికి వస్తుంది. ఈ సమయంలో మీకు సహాయం చేస్తమని చెబుతు మీ వల్ల పనులు నెరవేర్చుకుని తప్పుకుని పోయే మనుష్యులు తటస్థపడతారు. స్నేహితులవద్దనుంచి శుభలాభవార్తలు తెలుస్తవి. 14, 15 లలో శ్రమఅధికం. పనులలో పొరపాట్లు.

* * *

**మకరం :**

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా,

శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

శ్రమపడినందుకు ఫలితం బాగా ఉంటుంది తరచు సందేహాలు మిమ్ములను బాధిస్తు ఉండటంవల్ల కొన్ని సమయాలలో చేతికి అందిన అవకాశాలను వదులుకొంటారు. అధికారులవల్ల మీ పనులు సుఖంగా నెరవేరుతవి. బంధువులవద్దనుంచి నిష్ఠురమైన వార్తలు రావటంవల్ల మనస్సులో ఆందోళన కలుగుతుంది ఆరోగ్యం తాత్కాలికంగా లోపిస్తుంది పిల్లలమూలంగా సుఖసంతోషాలు లభిస్తవి. మీరు కొన్ని సమయాలలో అకస్మాత్తుగా ఇతరుల మనస్సును నొప్పించటం జరుగుతుంది. కుటుంబంలో ఖర్చులు పెరగగల సమయం. బంధువులు మీ మాట ప్రకారం నడుచుకోరు. కాని సలహామాత్రం కోరుతూ మీకు శ్రమ కలిగిస్తారు. వస్తువులు మొదలయినవి మీ పొరపాటువల్ల పోయే అవకాశాలున్నవి. 12, 13 లలో వృత్తిలో మంచి అవకాశం, పుణ్యకార్యాలు.

* * *

**కుంభం :**

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం,

పూ. భాద్ర 1, 2, 3 పా)

మీరు అనుకున్న పనులు అన్ని సంపూర్ణంగా నెరవేరగలవని అనుకోవద్దు. మీ అప్తులే మిమ్ములను చిక్కుపనులలో దించటానికి ప్రయత్నిస్తారు. ఖర్చులు తగ్గించుకోవటానికి ప్రయత్నించటం అవసరం మీ అంతరంగిక విషయాలను గురించి తెలుసుకోవటానికి ప్రయత్నించే మనుష్యులను గురించి జాగ్రత్తగా ఉండండి. మీ ఆరోగ్యం చెడే అవకాశాలున్నవి. ఆహార విహారాలలో శ్రద్ధఅవసరం. దైవిక వేదాంత విషయాలలో ఆసక్తి కలుగుతుంది. వ్యవహార కార్యకలాపాలలో మీ కోరికలు ఫలిస్తవి. వృత్తిసంబంధితవిషయాలలో మీతో స్నేహంతో ప్రవర్తిస్తు మిమ్ములను వంచనచేయటానికి ఎదురుచూచే మనుష్యులుంటారు. ఎవ్వరితోను విరోధాలు పెంచుకోవద్దు. 16, 17 తేదులలో త్రిప్పట, వృధాఖర్చులు, కష్టవార్తలు.

* * *

**మీనం :**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

ఆరంభించినపనులు మధ్యలో వక్రించగలవు. కాని చివరకు అనుకూలిస్తవి. ధైర్యము పట్టుదల అవసరం. వ్యవహారరంగంలో ఆలస్యం కనుపించినా అనుకూలం ఉంటుంది. పిల్లల ఆరోగ్యం బాగుండదు. తొందరపడి ముందుగా ఖర్చుతోకూడిన కార్యభారం పైన పెట్టుకోవటంవల్ల పశ్చాత్తాపపడతారు. కుటుంబంలో కలహప్రసంగాలు వచ్చేట్లు తోస్తుంది. కాని ప్రత్యక్షంగా రాకుండా సమసిపోగలవు ఇతరులవద్దనుంచి రావలసిన ధనం సక్రమంగా రాదు. ప్రయాణ కార్యక్రమాలను వాయిదా వేసుకోవటం మంచిది. ఇతరులకు సలహా చెప్పబోయి నిష్ఠురాలు తెచ్చుకుంటారు. 14, 15 లో శ్రమవల్ల కార్యసాఫల్యం గౌరవప్రాప్తి ధనయోగం.



కావ్యాలూ కవితలూ — పరిశోధనలూ విమర్శలూ — నాటకాలూ నాటికలూ — నవలలూ నవలికలూ — కథలూ

# చివరకు ఈనాటికి!

సులువుగా, చౌకగా ఎవరికి వారు స్వంత గ్రంథాలయం ఏర్పరచుకోవడా నికి అపాయం లేని ఉపాయం చిక్కింది.

నెలనెలా అయిదే అయిదు రూపాయల చందా పద్దెనిమిది నెలలపాటు పంపడం!, అంతే!!

దేశంలోని ప్రసిద్ధ ప్రచురణకర్తలు ప్రకటించిన వేయింటికి దాటిన ఉత్తమ గ్రంథాలనుండి మీకు సర్వాత్మనా నచ్చిన రూ. 100 ల పుస్తకాలు మీ స్వంత గ్రంథాలయానికి లభిస్తాయి.

—మరో తొమ్మిది మంచిపుస్తకాలుకూడ బహుమతిగా లభిస్తాయి మొదటి నెల చందా చేరగానే మా బహుమతి గ్రంథాల జాబితానుండి మీరు కోరిన మూడు గ్రంథాలు తొలి కానుకగా పంపుతాము

సమకాలీన సాహిత్యప్రభలను, సాహిత్యపరిణామాన్ని ఎప్పటి కప్పుడు వెల్లడిపరచే 'పుస్తక ప్రపంచం' మాసపత్రిక తాలూకు 18 సంచికలు వరసాగ్గా మీకు ఉచితంగా వస్తాయి.

వీటన్నింటికీ అన్నీ రవాణా ఖర్చులు యావత్తూ మావే

నెలకు అయిదే అయిదు రూపాయల ఖర్చుతో పద్దెనిమిది మాసాల్లో చందా దారులు పుస్తకాలూ పత్రికల రూపంలోనైతేనేమి, తదితర సదుపాయాల రూపంలో నైతేనేమి, మొత్తంమీద రూ 127 ల ఫలితం పొందుతారు. అంటే వారికి రూ. 90 మీద రూ. 37 ఆదా అన్నమాట

1. పథకంలో చేరి మొదటి నెల చందా రూ. 5 కట్టంగానే మూడు మంచి పుస్తకాలు ఉచితంగా లభ్యమవుతాయి
2. 7 నెలలు వరుసగా చందాకడితే, 7–వ నెలకు మా క్యాటలాగునుంచి మీరు కోరే రూ 30ల పుస్తకాలూ, ఇంకొక మూడు ఉచితంగానూ వస్తాయి
3. 13 నెలలు చందా కడితే, 13–వ నెలకు మా క్యాటలాగునుంచి మీరు కోరే మరి రూ 30 ల పుస్తకాలూ, ఇంకొక మూడు ఉచితంగానూ వస్తాయి.
4. అనుకొన్న 18 నెలలూ చందాకడితే, అలాగే మరి రూ. 40 లకు మీరు కోరే పుస్తకాలు వస్తాయి

ఈ రూ 100 ల పుస్తకాలతోనూ, 9 బహుమతి పుస్తకాలతోనూ సంసార పక్షంగా గౌరవప్రదమూ, గర్వహేతువూ అయిన చిన్న గ్రంథాలయం ఏర్పరచుకోవచ్చు.

ఎప్పుడైనా, ఏ కారణంవేతనైనా మీరు మధ్యలో చందాకట్టడం మాని వేసినా అప్పటివరకూ మీరు చెల్లించిన మొత్తం విలువకు సమానమైన ఉత్తమగ్రంథాలు మీకు తప్పక వస్తాయి కాగా, ఇందులో చేరడంవల్ల మీరు నష్టపోయేదేమీ ఉండదు కాబట్టి తక్షణమే మొదటినెల చందా కట్టి, మీ స్వంత గ్రంథాలయానికి పునాదులు వేసుకోండి.



ఇటాలియన్ భాషకు కూడ ఎక్కిన మంజేరీ ఈశ్వరగా అద్భుత నవలకు తెలుగు.



కట్టుకథలు' చక్రవర్తి రాజగోపాలా చార్యుల రచనకు అను వాదం



నోబెల్ బహుమతి గడించిన హెర్మాన్ హెస్ నవలకు అను వాదం

పోతన, శ్రీనాథుడు, పింగళిసూరన రచించిన ఉద్గ్రంథాలు మొదలు నార్ల, ... పాటి, చలం, భరద్వాజ, విశ్వనాథ సత్య... వేమరాజు భానుమూర్తి, గోరాశాస్త్రి, ఆ... కృష్ణ మాలతీచందూర్, శ్రీదేవి వివేకా... రావు, పోతుకూచి సాంబశివరావు మొద... వివిధగ్రంథాలవరకూ పలువురు ప్రచుర... సంపుటాలుగల మా క్యాటలాగులోనుండి అంతట మీకోరే ఏరుకోవచ్చు

1 దేవి యజమానులు గడచిన 38 ఏండ్లనుండి పుస్తక ( ... కెక్కిన యం శేషాచలం అండు కంపెనీ




(గత వారం తరువాయి)

ఈ మాటలు వింటూన్న అప్పా చెల్లెళ్లు, పెద్దగా నవ్వుతూ "వెనక్కి వచ్చి చాపమీద కూర్చున్నారు." అయితే బావా నీకు మా అక్కని ఆడిపోసుకోవటం తప్పించి మరో పని లేదా." అంది రాధ.

"ఇది మరీ బాగుంది ముందుమాట అన్నది మీ అమ్మగారు. దానికి నేను చెప్పింది జవాబు మాత్రమే."

లక్ష్మమ్మగారు ఉన్నట్టుండి "అవతల వాటా చూడలేదే. పదండి చూద్దాం" అన్నారు.

రామచంద్రం గతుక్కుమన్నాడు. జానకమ్మ ముఖంలో నవ్వు మాయమయిపోయింది. లక్ష్మణరావు మటుకు పదండి. చూద్దురుగాని' అంటూ ముందుకు నడిచాడు.

ముందు గదిలో ఒక టేబిలు రెండు కుర్చీలు ఏవేవో పుస్తకాలూ ఉన్నాయి. మధ్య గదిలోకి వెళ్ళేసరికి రెండు మంచాలు గోడకి చేరవేసి ఉన్నాయి. గోడమూల రెండు [illegible]. ఒక మాసిపోయిన బట్టల బుట్ట, దాని[illegible] మీద కొన్ని పక్కబట్టలు కనిపించాయి. వంటగదిలోకి నడిచేసరికి [illegible]నించి వేలాడుతున్న కట్టెల మోపు ముందుగా కనిపించింది.

లక్ష్మమ్మగారు ఆశ్చర్యంగా "ఇక్కడ ఇంకో కట్టెల మోపువుందే" ఇంకో బొగ్గుల బస్తావుంది. ఈ సామాను లేవిటే? అంటూ ప్రశ్నలు వెయ్యసాగారు. సమాధానం కోసం ఎదురు చూడకుండానే 'ఇంకా పాతవాళ్ళు పూర్తిగా ఖాళీ చెయ్యలేదా?" అని మళ్ళీ ప్రశ్న వేసారు.

"లేదు వాళ్ళు పూర్తిగా ఖాళీచేశారు" అన్నాడు లక్ష్మణరావు

"మరి ఇవంతా ఏవిటి? ఏదో ప్రత్యేక వాటాలా ఉందే. నాకేమి బోధపడ్డంలేదు"

రాధమ్మ లక్ష్మణరావు ముఖంలో భావాలని చదవాలని ప్రయత్నిస్తూంది. రామచంద్రం గుమ్మానికి చారబడి తలవంచుకుని నిలబడ్డాడు.

ఇక ఈ అనిశ్చితస్థితిని కొనసాగించటం ఇష్టంలేక లక్ష్మణరావు 'మీకు అన్ని విషయాలు వివరంగా చెబుతాను కూచోండి. కాని విన్న తర్వాత మీరు ఏవిధమైన మనో వికారం లేకుండా. ధైర్యంగా ఉండాలి" అందరి దృక్కులూ అతని వైపు తిరిగాయి. "ఏమీ లేదు. ఇక్కడికి చుట్టం చూపుగా వచ్చామనే ఉద్దేశంలో నే మీరున్నారు. అసలు విషయం అదికాదు. మీరు చాలా కాలం అంటే కొన్ని సంవత్సరాలు ఇక్కడే ఉండబోతున్నారు. ఈ వాటాలో మీరూ, రామచంద్రం, రాధమ్మ, బేబీ ఉంటారు. అవతలి వాటా మాది. ఇలా చేస్తున్నందుకు మీరు ఎవరినీ నిందించకండి. చాలా ఆలోచించిన మీదటే ఈ ఏర్పాటు చేశాం. అదంతా నెమ్మది నెమ్మదిగా మీకే బోధపడుతుంది. ఇక్కడ మీకు ఏ ఇబ్బందీ ఉండదు. కులాసాగా కాలక్షేపం చెయ్యండి" అన్నాడు లక్ష్మణరావు.

ఒక్కమారు అక్కడవున్న లక్ష్మమ్మగారూ, రాధమ్మా నిశ్చేష్టలైపోయారు. జానకమ్మ ముఖం పక్కకు తిప్పుకుంది. రామచంద్రం ఓపిరి మెల్లగా వదిలాడు. ఎవరూ నోరు మెదప సాహసంలేక అలా నిలబడిపోయారు.

ఆ నిశ్శబ్దాన్ని లక్ష్మణరావే భంగపరుస్తూ "ఇందులో మీకు అనంగీకారమైన విషయం ఏముంది? అక్కడవుంటేబదులు ఇక్కడ ఈ కొడుకుదగ్గర వుంటారు" అన్నాడు.

రాధమ్మ కొద్ది ఆలస్యంగా అయినా తేరుకుంది. లక్ష్మమ్మగారు ముఖం ఎర్రగా చేసుకొని 'ఎంత మోసం, ఎంత అన్యాయం' అని అస్పష్టంగా అనుకుని గోడవార కూర్చుండిపోయారు. ఆవిడ చీరచెంగు ముఖానికి అడ్డం పెట్టుకుని కన్నీరు పెట్టుకుంది. జానకమ్మ ఆమె పక్కకు చేరి "అన్నయ్య నీతో ఏమీ చెప్పలేదా అమ్మా" అంది.

"ఎందుకు చెబుతాడమ్మా. నేనంటే అంత అలుసైపోయింది నేనో రాతిసినో, పెద్దపులినో అన్నట్టుగా వణికి చూస్తున్నారు. ఇంతకంటే మించిన అవమానం ఏముంటుందమ్మా. నా బ్రతుకు ఇలా అయిపోయింది. అయ్యో!"

"మీరలా బాధపడితే నేనేమీ చెప్పలేను. ఇందులో అతని తప్పేమీలేదు. దీనికంతా నాదే బాధ్యత. మీరు తిట్టదల్చుకుంటే నన్ను తిట్టండి. అతన్నేమీ అనకు" అన్నాడు లక్ష్మణరావు.

"ఈ గడుసుమాట లెందుకు నాయనా. జరిగిందేదో జరిగిపోయింది. ఇది వాడు చేస్తాడని నేననలేదు. దీనికంతా మూలం ఎవరో నాకు తెలుసు... నాకు తెలుసు నాయనా..."

లక్ష్మమ్మగారు ఎవర్ని దృష్టిలో పెట్టుకుని ఈ మాటలన్నారో రాధకి తెలుసు. ఈ తల్లి నోటవెంబడి ఎలాంటి ప్రమాదకరమైన మాటలు వెలువడతాయో అనే భయంతో ఆమె "మనం ఎక్కడయితే ఏముందమ్మా. ఆ అన్నయ్యదగ్గర కొన్నాళ్ళూ, ఈ అన్నయ్యదగ్గర కొన్నాళ్ళూ ఉందాం... ఇందులో బాధపడవలసిన విషయం ఏముంది?" అని వారించబోయింది

"అసలు విషయం అదికాదు. వాళ్ళ మనసులోవున్న భావాలు ఎటువంటివో యీ మోసాన్ని బట్టి తెలియటంలా. తల్లిని నా ఎదుటకొచ్చి ఇలా అని నిజం ఎందుకు చెప్పకూడదు నాదగ్గర ఎందుకు అబద్ధం చెప్పాలి. నన్ను ఇలా అవమానపరుస్తాడా? తల్లికి ఇవ్వవల్సిన గౌరవం ఇదేనా అని అడుగుతున్నా. ఈ పెళ్ళాలు మధ్యలో వచ్చారు. ఈ తల్లి మొదట్నుంచీ ఉంది. అయితే కొం మధ్యలోవచ్చిన కొమ్ములు వాడి. తల్లి విషంతో సమానం అయిపోయింది. నా కొడుకు ఇలాంటివాడు అయిపోవాలా? అందుకే నెయ్యంకాని, వియ్యంగాని సమానులతో చెయ్యాలని అంటారు. దరిద్రులింటి ఆడబడుచుని ఇంటికోడలు చేసుకుంటే గుండెలమీద కుంపటి పెడుతుంది. సంసారంలో విషం పోస్తుంది. నేను నెత్తీనోరూ బాదుకుని చెప్పాను. వింటేనా" ఈ కఠినమైన ధోరణి వినలేక లక్ష్మణరావు "మీరు బాధపడకండి" అని బయటకివెళ్ళిపోయాడు.



# జీవనగంగ

రాధరాణి చంద్రం పక్కగా వచ్చి మెల్లిగా "అమ్మ ధోరణి ఇలాగే వుంటుంది. ఒదిన గురించి అమ్మ చాలా అన్యాయంగా మాట్లాడుతుంది. అన్నయ్యకి కష్టంగా వుంటుంది. ఈ విషయంలో అన్నయ్యకీ, అమ్మకీ ఘర్షణ కూడా వచ్చింది. మీరేమీ మరోలా అనుకోకండి" అంది రాధ.

అన్న చెల్లెల్లిద్దరూ ముందు గదిలోకి వెళ్ళారు. "నాకు అంతా కొత్తగా వుంది కొంచెం తెలుసు. అన్నయ్య సవివరంగా ఈ తరం రాశాడు" అన్నాడు మహేంద్రం.

వంటగదిలో తల్లీ కూతుళ్ళు మాటలాడుకుంటున్నారు.

రాధ కుతూహలంగా 'అన్నయ్య ఏమని రాశాడు?' అంది.

"నువ్వు ఆవు తరం చదవాలి నేను చెప్పటం కంటె అది చదవటం మంచిది"

గోపి ఇల్లంతా గాలించి ఓ సుద్దముక్క సంపాదించాడు. దాంతో నల బల్ల మీద బొమ్మలు వెయ్యాలని వాడి ఊహ కాని బోర్డు అందలేదు. ఒక బల్ల తెచ్చి కింద వేసుకుని ఆ కార్యక్రమంలో మునిగిపోయాడు.

"మొట్టమొదట ఒక విషయం [illegible] సహజం. అమ్మకి అన్నయ్యకి బొత్తిగా పడటం లేదు. వదినకి మామ్మకీ [illegible] అంటుంది. అన్నయ్యకు కోపం వచ్చి ఏదో అంటాడు. అది చిలికి చిలికి గాలివానవుతుంది. ఎంత సేపు డబ్బు గురించిన తగాదాలే" అంది రాధ.

"ఇక మీదట అన్నయ్య స్థానంలో నేనుంటాను".

"అయితే అలాంటి కోపతాపాలు ప్రవర్తించటానికి మరో వదిన ఇక్కడ లేదుగా"

తెలుసు. ఏదో ఒక రూపంగా ఉపాధ్యాయుడు తను దగ్గరనుంచీ డబ్బు తీసుకుని బుణపడుతున్నాడు గనుక, అతడా బుణాన్ని ఏ రూపంలోనైనా తీర్చుకుంటాడు. తీర్చుకోకపోతే అతడి మాట మిగలదు!

దురదృష్టవశాత్తు యిలాంటి ఉపాధ్యాయులు నలుగురైదుగురు జట్టు కలిసిన పాఠశాలలో పరీక్షా ఫలితాలు షష్ఠ ఫారం వరకూ తారాపథాన్ని చూచి, యస్.యస్.యల్.సి. లో మట్టుకూ అడుగంటుకపోతే అందుకు ఆశ్చర్యపడడం అనవసరం!

మరికొందరున్నారు. వీళ్ళను ప్రాప్తకాలజ్ఞులనుకోవచ్చు. పరీక్షలు రేపనగా వీళ్ళ బుద్ధి చురుకుగా పనిచేయడం మొదలెడుతుంది. తొడను చీల్చి అందులో సంజీవి పుల్లను దాచుకున్నట్లుగా, వీళ్ళు వీలైన ప్రతిచోటా కాగితాలు దాచుకొని పరీక్షలకు సిద్ధమౌతారు. ఇదంతా యిద్దరు మంత్రవాదులు పోటీకట్టడంలాంటి తతంగం. ఐతే ఇటీవలి వార్తల్నిబట్టి ఈ పోటీలో ఉపాధ్యాయుడి విజయం గొప్ప సందిగ్ధావస్థలో పడిపోయినట్లు తెలుస్తోంది. కృష్ణపరమాత్ముడు తనలోని శక్తినంతా ఆకర్షించివేసిన తర్వాత రాణివాసపు జనాన్ని కిరాతకులు దోచుకపోతుండగా కళ్ళారా చూస్తూ నిస్సహాయుడై నిస్తేజుడై నిల్చున్న అర్జునుడిలా అగతికుడైపోయాడు ఉపాధ్యాయుడు.

విద్యార్థుల్లో క్రమశిక్షణ లోపించడానికి కారణాలేమిటని పరిశీలిస్తున్నప్పుడు పాఠశాలల్లోని అంతఃకలహాలను మరచిపోవడానికి వీలుండదు. ఉపాధ్యాయులమధ్య ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ అంతఃకలహాలు ప్రజ్వరిల్లుతున్న పాఠశాలల్లో విద్యార్థుల విద్యాస్థాయిగానీ, ప్రవర్తనగానీ క్రమంగా వుండాలని ఆశించడంలో సబబు కనిపించదు. ఒకరిపైన ఒకరు అభాండాలు వేసుకోడం, పుకార్లు రేపుకోడం, వాటిపైన విచారణలు జరగడం సంజాయిషీలు అడగడం— యిలాంటి అలజడితో వాతావరణం కలుషితమైపోయిన పాఠశాలలు అక్కడక్కడా కనిపిస్తాయి. ఇందుకుతోడుగా ప్రధానోపాధ్యాయుడు ఒక కంటిలో వెన్నా, ఒక కంటిలో సున్నమూ వుంచుకుని ఈ వివాదాలను పరిష్కరించదలుచుకున్నట్లయితే, యిక ఆ పాఠశాలను భగవంతుడు మాత్రమే రక్షించవలసి వుంటుంది!

ఐతే యిన్ని క్లిష్టపరిస్థితుల్లోగూడా సమస్యలన్నింటినీ అవలీలగా నిమ్మకు నీరెత్తినట్లు నిశ్చలంగా తమ పనేమిటో తాము చేసుకపోతున్న పాఠశాలలు కొన్ని కన్నులపండువగా కన్పిస్తాయి. ఈ అద్భుతానికి కారకులెవరా అని ఆలోచిస్తే బాహ్యప్రపంచాన్ని విస్మరించి, సర్వకాల సర్వావస్థల్లోనూ పాఠశాల కార్యకలాపాల్లో నిమగ్నుడైపోయిన ప్రధానోపాధ్యాయుడు ప్రత్యక్షమౌతాడు. స్వభావాన్నిబట్టి ఈయన ఒకచోట మహర్షిగానూ, మరొకచోట పెద్దపులిగానూ వ్యవహరింపబడతాడు. ఎలా వ్యవహరింపబడితేనేమి, పాఠశాలలో ఆయన నీడపడని తావుండదు. కొంటె విద్యార్థిపాలిటికి గుండెల్లో జ్వరంగా వుంటూ, మంచి విద్యార్థులకు ప్రోత్సాహమిస్తూ, పేదవిద్యార్థులకు ఆశ్రయాలు కల్పిస్తూ, లౌకిక శక్తులకు లొంగకుండా ధాటీగా నూటిగా తన బాటవెంట నడిచిపోతున్న ఈ మనీషిని చూడగానే చేతులు జోడించాలనిపిస్తుంది. పాఠశాల యొక్క సత్సంప్రదాయాన్ని సుస్థిరం చేయగల యిలాంటి ప్రధానోపాధ్యాయులు ఒక్కొక్క పాఠశాలకూ ఒక్కరు గనుక లభిస్తే యిక అంతకంటె కావలసిందేముంటుంది?

అన్ని రంగాల్లోనూ నూతన చైతన్యం రావాలని ఎదురుచూస్తున్న రోజులివి... అన్నింటికన్నా ముఖ్యం విద్యారంగం. భావి పౌరుల ఆదర్శజీవనాలకు సుదృఢమైన పునాదులు ఈ రంగంలోనే ఏర్పాటు కావాలన్న సత్యాన్ని ఎవ్వరూ కాదనరు. విద్యాప్రణాళికలో నైతిక విద్యకు సముచితస్థానం యివ్వవలసి వున్నదేమో ననిపిస్తుంది. మోరల్ యిన్‌స్ట్రక్షన్ క్లాసులున్నాయిగానీ అవేమో లాంఛనప్రాయంగా జరుగుతున్నాయి. వాటిని సంస్కరించాలి. ఇతర శక్తుల ప్రాబల్యమూ, ప్రభావమూ ఈ రంగంపైన ప్రసరించకుండా కట్టుదిట్టాలు చేయాలి. హద్దులు దాటని నిర్బంధంవల్లనైనాసరే విద్యార్థులను అదుపులో పెట్టకోవాలి. ఇదంతా ఎలా జరగాలన్న విషయాన్ని గురించి మన విద్యావేత్తలు మరింత గాఢంగా ఆలోచింపవలసిన తరుణం యిదే!



# వనితాలోకం



# తీయనికలలూ తీరనికాపురాలూ

ఎందరో మహాకవులు వర్ణించినట్లుగా, జీవితంలో ముఖ్యమైనదశ వైవాహిక జీవితం. అందులో, ముఖ్యంగా స్త్రీలకు ఇది మరో పునర్జన్మవంటిదనంటే బాగుంటుంది. వివాహానికి పూర్వం స్త్రీకి జీవితంలో సాధారణంగా ఏమంత చెప్పుకోదగ్గ అనుభవాలుండవు. నిజానికి స్త్రీ జీవితానికి నాంది వివాహం. పెళ్ళయ్యేంతవరకు, నూతన భాగస్వామితో జీవితమెలాగ? అని ఏవేవో అనిర్వచనీయ అనుభూతులతో ఊహాలోకాలలో విహరిస్తూ కలలుగనడం సహజం. కాని వచ్చినచిక్కల్లా, అసలు కొత్తకాపురం మొదలు పెట్టడంలో వుంది. అదేగాని ఇద్దరు విభిన్న ప్రకృతులు, భిన్నాభిరుచులు గలవారయితే ఇంక ఝంఝామారుతాలకు, చీటికీ మాటికీ చిరాకుపడటానికి కొరతే వుండదు. ఆవిధంగా ఇంకా కొత్తదనం, అచ్చటా, ముచ్చటా తీరందనే, తీరని కలతలతో సతమతమవుతున్న అనేక కాపురాలను మనం చూస్తూనేవున్నాం. తమ పూర్వ ఆశయాలూ, అభిరుచులు ఎలాంటివయినా, అవసరమయితే వాటిని త్యాగంచేసి, తమ వైవాహిక జీవితాన్ని ఆనందమయం చేసుకున్న వారూ లేకపోలేదు. కాని అలా గాకుండా మొండిపట్టుదలతో, గుడ్డినమ్మకాలతో ఏవేవో ఊహాలోకాల్లో విహరిస్తూ చివరకు ఊహకు వాస్తవికానికిగల అగాధంలోపడి, జీవితంలో ఏదో కోల్పోయామని ఏదో తెలియని వెలితి ననుభవిస్తూ, పచ్చటి కాపురాలను, చేజేతులా చెడగొట్టుకున్న వారూ వున్నారు. అటువంటి వారిని మనం అక్కడక్కడా చూస్తూనే వుంటాం.

ఒకావిడ కొత్తగా కాపురానికి వచ్చింది. ఆ అమ్మాయి బి. ఏ; చదువుతున్నది. భర్త కాలేజీలో లెక్చరరు చేస్తున్నాడు. ఆ అమ్మాయి కాలేజీలో చదువుతున్నప్పుడు, మాక్ పార్లమెంటులలో, ఎలక్యూషన్ కాంపిటీషన్లలో ఎన్నెన్నో ఉపన్యాసాలిస్తుండేదట. ఆ అమ్మాయి మొదటినుంచి కొన్ని ఆదర్శాలను, ఆశయాలను తనలోనే పెంచుకొన్నది. కట్నం తీసుకునే వాళ్లయితే, అసలు పెళ్లే చేసుకోననేది. అదృష్టవశాత్తు అదే అభిప్రాయంగల అతను, కాలేజీలో లెక్చరరుగ ఉద్యోగం చేస్తున్నప్పటికి, కానీ కట్నం తీసుకోకుండా ఈ అమ్మాయిని చేసుకున్నాడు. అంతకుముందు పరిచయం లేకపోయినా, పెళ్లిలో ఇద్దరూ ఒకరికొకరు బాగా ఆకర్షింపబడ్డారు. అటువంటి కాపురం ఆనందమయంగా, సౌఖ్యవంతంగా వుంటుందనటంలో సందేహమేం లేదుగదా. కాని పాపం ఆ అమ్మాయి ఆశయాలకు, ఆమె భర్త అభిప్రాయాలకు అనేక విషయాల్లో విరుద్ధాభిప్రాయాలు కల్గి

## బోయిన కనకదుర్గ

వుండేవారు. ఈ సంగతి తర్వాత చాలా కాలానికి, కాపురం కొన్నాళ్లు సాగించేటప్పటికి గాని వారికయినా తెలియలేదు. ఆయనేమో అసలే లెక్చరరు. ఈమె పూర్తిగా ఆదర్శవాదిని. ఇద్దరూ గంటల తరబడి, ఆయా విషయాలమీద వాదోపవాదాలు చేస్తుండేవారు. వాదం వట్టిదిగానే పూర్తయితే, అంత ఇబ్బందే వుండదు. కాని అది నెమ్మది నెమ్మదిగా, చిలికి చిలికి గాలివానన్నట్టు పెద్దదయి, ఒకళ్ళకొకళ్ళు రోజుల తరబడి మాట్లాడుకోనేవారు కారు. ఆమె, "నేనూ ఉద్యోగం చేస్తాను. తప్పేమిటి. ఇప్పుడు వచ్చేదానికన్నా ఎక్కువవుతుంది, భావిలో ఆసరాగా వుంటుం"దనేది. అతను "ఇప్పుడు మనకువచ్చేది మనిద్దరికీ ఎక్కువ తక్కువ లేకుండా సరిపోతున్నదిగదా, నువ్వు ఉద్యోగం చేస్తేనేగాని తీరదన్న పెద్ద అవసరమేం లేదుగదా" అనేవాడు. ఆయనకి భార్యచేత ఉద్యోగం చేయిస్తే, భర్తకు అవమానకరం అన్న ఉద్దేశ్యంకలవాడు. దీనిమీద చాలా రోజులు ఘర్షణపడి, స్వతంత్రించి తన పుట్టింటికి వెళ్ళిపోయింది. చివరకు ఎన్నో నెలల తర్వాతగాని, వాళ్ళిద్దరకు సామరస్యం కుదరలేదు.

ఇంకో ఆవిడుంది. ఆమె అంతగా చదువుకోలేదు గాని అజ్ఞానానికేం లోటులేదు. భర్త మంచి ఉత్సాహం, విశాలాభిప్రాయాలు కలవాడు. తన భార్యతో కలిసి సినిమాకు వెళ్లాలని, భార్యను సాయంత్రం తనతో షికారు తీసికెళ్లాలని. తన స్నేహితుల ఇండ్లకు తీసికెళ్ళి, వాళ్ళ భార్యలను పరిచయం చెయ్యాలని ఎంతో ఉబలాటపడుతుండేవాడు. అవి సామాన్యంగా ఏమంత వింతకోర్కెలు కావు, పైగా సహజం. కాని ఆ అమ్మాయి అతని అభిరుచులకు పూర్తి విరుద్ధం. ఏ ఆదివారమో స్నేహితులింటికి వెళ్దామంటే, "ఆ! ఇప్పుడేమంత అవసరం? వెళ్ళకపోతే మాత్రమేం?" అనేది. భర్త పక్కన నడుస్తూ షికారు వెళ్ళామంటే ఆమెకు తగని సిగ్గు. భర్త ఎంతో ప్రాధేయపడితే గాని చివరకు సినిమాకయినా వెళ్లేది కాదు. అదయినా ఏనాటికో కోటికో. చిట్టచివరకు ఆవిడతో విసిగిపోయి, భర్త ఆమెను రాత్రుళ్ళు వచ్చి చితకబాదటం మొదలుపెట్టేవాడు. ఆ అమ్మాయి ఆ దెబ్బలు భరించలేక "అమ్మో, బాబోయ్," అని పెట్టే పొలికేకలు విన్నవాళ్లకు హృదయవిదారకంగా వుండేవి. సహజంగా, అంతకుముందు అతి శాంతో సున్నితమయిన మనిషి. తన అభిప్రాయాలతో భార్యను ఏకీభవింపచెయ్యాలని ఎన్నో విధాల ప్రయత్నించి, చివరకు ఏమీలాభంలేక విసుగెత్తి, పెళ్లాన్ని హింసిస్తుండేవాడు.

ఈ ఇదరూగాక, విచిత్రమైన ఇంకో ఆమెవుంది ఆమె కాపురానికి వచ్చినవటంతోనే, చీరలని నగలని ఎన్నో గొంతెమ్మ కోర్కెలకోసం భర్తను పీడిస్తుండేది. అతను మామూలు మధ్యతరగతికి చెందినవాడు. ఈమె అంతులేని కోర్కెలను అతనుమాత్రం ఎంతకాలం తీర్చగలడు! అక్కడకు,

# ఆడవాళ్ళూ-దీక్షలూ

★ వి. పుల్లమాంబ ★

"నూరు చెప్పండి వేయి చెప్పండి—; నేను మాత్రం మీ భావాలను సమ్మతించలేనం"టూ, పార్వతి పెదిమెగంపెటువంతో ప్రక్కయింటి శాస్త్రిలుగారు కంగారుపడి యింతకూ—పార్వతి చెప్పిన దాంట్లో సత్యమెంతవరకుందీ అని, విమర్శించడం ప్రారంభించాడు. "నిజమే—భగవంతుడు ప్రాణుల్ని సృష్టించేటప్పుడు రెండురకాలుగానే సృష్టించడం భాగ్యం. మహారాజుల బిడ్డలైతే మంచంనుండిదిగి, తిరిగి మంచంఎక్కి పళ్ళుమరచేదాకా శ్రమంటే యేమిటోయెరక్కుండా హాయిగా జీవిస్తారు. కావలసిన సౌకర్యాలన్నీ సమకూరుతాయి. సంతోషంగా కాలక్షేపం అవుతుంది. వింతలు, వినోదాలు సంభవిస్తూ ఉంటాయి. చేతినిండుగా ధనం, దానికి తగినహోదా.—దేవభావల్లో వైవిధ్యం—ఒక లేమిటి! స్వర్గ సుఖాలన్నీ ఇక్కడే అనుభవించొచ్చు. ఎవరిమీదేనా అనురాగం కలిగిందో, మూడు నిమిషాలలో వాళ్ళను తమ చిత్తానుసారం తిప్పుకోవచ్చు. కర్మంచాలక— ఎవడేనా కంటపడి పొరపాటుచేతనేనా ఆగ్రహానికి గురిఅయ్యాడో వానిపని అప్పుడే అఖరు చేయొచ్చు. పుణ్యం—పాపం అనీ, కుడీ—ఎడమా అనీ, హెచ్చు—తగ్గుఅనీ, ఆ కోపంలో దవ పెట్టకపోతే ప్రపంచాన్నే తారుమారు చేయొచ్చు. ఎంతమంది రాజకుమార్తెలు ఎన్నెన్ని సాహసకార్యాలు చేయలేదు! సత్యభామ సంగతి చూడండి;— విష్ణుని అవతారమైన శ్రీకృష్ణున్నే కాళ్ళతో తన్నిందిక; స్వర్గంలోనున్న పారిజాతాన్ని, అన్నదమ్ములమధ్య కలహం పెట్టి, పెల్లగించి తెప్పించింది. ఈ సంగతులుచూస్తే, రాజకుమార్తెగానే జన్మించాలనడం సత్యమే—అయితే, అందరూ రాజకుమార్తెళ్ళవతారా! పూర్వపుణ్యంకొద్దీ, ఏ నూటికో, కోటికో, ఒకరో, ఇద్దరో జనిస్తారు. వాళ్ళదే జన్మ అనాలి; వాళ్ళబ్రతుకే ఆదర్శమైన బ్రతుకనాలి. ఐతే—

పూటకు టికానాలేక, రెక్కాడితే డొక్కాడకుండనే స్థితిలో, బీదకుటుంబంలో జన్మించినవాళ్ళుకూడా అదృష్టవంతులే. వాళ్ళదీ స్వేచ్ఛాజీవితమే. ఒకళ్ళమీదఆధారపడి ఉండవలసినక్కరలేదు. తెల్లవారిందిలగాయతు, తమఇంటిపనులన్నీ చక్కపెట్టుకొని, ఏ జమీందారుగారి ఇంటికో, భాగ్యవంతుల యిండ్లకోవెళ్ళి, తనకొచ్చిందీ వాళ్ళ పనులు సరిదిద్ది, శ్రమకుతగిన ఫలితం పుచ్చుకొని, ఆద్రవ్యంతో సుఖంగా కాలక్షేపం చేయొచ్చు. ఇష్టమైందీ పనిలోకి వెళ్ళొచ్చు. ఆపూట వంట్లో బాగులేకపోతే, ఈనీపూట రానని చెప్పి చక్కా రావచ్చు. తమ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు భంగంరానివిధంగా జీవితం గడుపుకోవచ్చు. గంగమ్మ సంగతి చూస్తే, నాకే ముచ్చటేసుంది. శారీరక శ్రమపడి ఇతరులకు కష్టం కలిగించకుండా, తన కష్టార్జితంతో కాలక్షేపం చేయడం; తనకు లేనిదానికి తహతహపడక, కలిగినదానితో కల్లో గంజో త్రాగి, సంతృప్తిగా జీవించడం. ఆ కొత్త

జీతంలో వెనకేసిన డబ్బు కూడబెట్టి నగ చేయించాడు. కాని అప్పటికే ఆమెకొక్క తీరక, భర్త ఫసుతారీఖున తెచ్చిన బియ్యం పప్పులూ, ఇతర సామానులు చాటుగా వాళ్ళకీ, వీళ్ళకీ అమ్మి చీరలవీ కొనుక్కుంటుండేది. నెలంతా సరిపోతయ్యాని తెచ్చిన సామాను పదిహేను రోజులకే అయిపోయిందని విన్న భర్త ఆశ్చర్యపడి, ఎక్కడో బాధలుపడి అప్పులుచేసి వెచ్చాలు తెస్తుండేవాడు పాపం ఆయనకది సరిపాటే. ఈమెకది అలవాటు అయిపోయింది. భర్త తనను ఏమన లేక, తిరిగి ఏదోవిధంగా వెచ్చాలు తేగానంతో, ఈమె తను కొంతడబ్బు తన చీరలకని మిగల్చగలిగానుగదా అని సంతోషిస్తుండేది. కాని ఆ పిచ్చిఇల్లాలు భర్త బయట బాధలుపడి అప్పుచేసేగాని ఇంట్లోకి ఆ సామాను రాలేదని గ్రహించేదికాదు. చిటచిటాకు, చెయ్యగా చెయ్యగా వాటికి, వీటికని, అప్పులు పెరిగిపోయి, పుట్టిన పాలం కాసా అమ్మితేగాని ఆ బాకీలు తీరలేదు. పుట్టింట దగ్గరకూడా ఆ అమ్మాయి నగలకనీ, చీరలకనీ తల్లిదండ్రుల దగ్గర విపరీతంగా మారాంచేసి తన పంతంసాగిచ్చుకునేదట. పాత అలవాటే కొత్తపంతాలో, [illegible] కాపురంల చూపించే టప్పటికి అది [illegible] ఎదురుపడింది.

జీవితపు పూర్వరంగంలో, అంటే వివాహానికి పూర్వం. అనేకపు అలవాట్లు, ప్రత్యేకాభిరుచులు అభిప్రాయాలు వుండవచ్చు. కాని వివాహమయిన తర్వాత కొంచెం హెచ్చుతగ్గులుగా. అటో, ఇటో సర్దుకుంటూ, జీవితగమనాన్ని సాఫీగా సాగించుకోవలిగాని, మొండిపట్టుదలలకు, మూర్ఖపు ఆవేశాలకు పండంటి నూరేళ్ళ జీవితాన్ని, స్త్రీకి అసలైన సంసార జీవితాన్ని విచ్ఛిన్నం చేసుకోడం, ఆ జన్మాంతం కలతపడటం ఏ మంత వివేకమైన పనికాదు. స్త్రీలు పెద్దచదువులు చదివి వుండవచ్చు, లేదా కొన్ని ప్రత్యేకాభిప్రాయాలు కరడుగట్టి వుండిపోవచ్చు, కాని ఎల్లప్పుడు వాటినే పట్టుకు వేళ్లాడుతూ వుంటామంటే, అర్థంలేని పని. ఎంతైనా స్త్రీ ముందు గృహిణి, ఆ తర్వాత ఏమయినా. భార్యతో సినిమా కెళ్ళామని, షికారుతీసి కెళ్ళామని నలుగురితో మసలనిచ్చి, జీవితానుభవానికి తన స్నేహితుల భార్యలతో పరిచయం కలిగించాలని ఏ భర్తయినా కోరుకొనే కనీసపు సామాన్య కోర్కెలు "ఉహూ, నే పట్టిన కుందేలుకు మూడే కాళ్ళు" అని మూర్ఖంగా మూల కూర్చుంటే, ఏ పేశులా భర్త అభిప్రాయాలను, దానితోపాటు తన నూతన కాపురాన్ని ధ్వంసం చేసుకొన్నట్టే. పైగా భార్యమీద కలిగిన ఆ అభిప్రాయాలు ఏర్థిలో యావజ్జీవితం నిలచిపోవటానికి మూలకంగా అవకాశముంది. మన పుట్టింటో అయితే ఎన్ని పట్టుదలలకుపోయినా, మారాలకు దిగి, మొండిగా తమమాట చెల్లించుకో చూసినా, అది ఎలాగోలా, మన అమ్మ, నాన్నే గాబట్టి చెల్లిపోతవి. స్త్రీ ఎలా తన భావి జీవితాన్ని గురించి కలలు గంటుందో, అలాగే పురుషుడు కూడా, తన కాబోయే భార్య ఇలా వుంటుందని, ఆమెతో సంతోషంగా జీవితానుభవాలను పంచుకుంటానని ఆశించడంలో అసంగతమేంలేదు. అందుకోసం, తనభార్యలో తన ఆశాకిరణాలను వెతుకుదామని భర్త, భర్తలో తన భావి జీవితపు [illegible]భాదీపులను అన్వేషిద్దామని భార్య, తమ కొత్త కాపురంలో కుతూహల పడవచ్చు. ఆంగ్లంలో ఒక సామెత వున్నది. "ఫస్ట్ యింప్రెషన్ యీజ్ ది బెస్ట్ యింప్రెషన్' అని అలాగే ఆ కొత్త కాపరపు రోజులలో ఏర్పడిన అభిప్రాయాలు కలకాలం మనస్సుల్లో ముద్ర వేసుకు వుండిపోగలవు. దానికి తగ్గట్టు స్త్రీ భర్త అభిప్రాయాలకనుగుణంగా వీలయినంతవరకు సరిదిద్దు[illegible]మని ప్రయత్నించాలేగాని, [illegible] తాడులాగితే, ఆ తర్వాత బాసట[illegible] చిన్న విషయం [illegible]. ★




# ఆడవారూ–దీక్షలూ

సినిమా చూడలేదనీ, ఈ చీర కట్టలేదనీ, ఆ పదార్థం అనుభవించలేదనీ, — ఒకటేమిటి — ఎన్ని కోర్కెలేనా జనిస్తుంచవచ్చు. గాని, అట్టిదొకటికూడా లేకుండా, నిశ్చింతగా, నిర్వికారంగా ఉంటుంది. తనకు లేకపోతే, లేనిదానికోసం తాపత్రయపడదు. తనకున్నదాంతో తృప్తిపడుతుంది. ఇంకా ఏదేనా కావలసివుంటే ఎవళ్ళేనా అడిగితే, దాన్ని చూచి జాలికలిగి, యేదో యిస్తూంటారు. ఆ జీవితమేనా ఆనందంగానే ఉంటుంది. పై వాళ్ళకీ, వీళ్ళకీ — నాస్తిమకొంతరం ఉన్నా-పోయిలో, తృప్తిలో. ఆనందంలో ఎవరి అంతస్తుకు తగ్గది వాళ్ళు అనుభవిస్తూంటారు. కాఫీలోకి పంచదార లేదని యేడ్చే దద్దమ్మా, గంజిలోకి ఉప్పులేక బాధపడే దంగయ్య, సమానంగానే బాధపడుతారు. ఐతే తారతమ్యం? దృక్పథంలోనేగాని వస్తువులలో లేదు. ఇంతకీ — రాజకూతురైనా మంచిదే — దాసికూతురైనా మంచిదే — గానీ, మధ్యరకంగా — అంటే అంత గొప్పకాక, అంత అధ్వాన్నంకాక, మధ్యస్థితిలో జన్మించటం, జీవించటం — అంతదరిద్రం, అంత నీచం ప్రపంచంలో మరొకటి ఉండదు. అటు భాగ్యవంతులకేసి చూసి, వాళ్ళలాగ ఉట్టికెగరాలని తలుస్తూ, ఉన్నా లేకపోయినా పెద్దయెత్తులు వేస్తూ, తాహతు మాలినఖర్చు చేయాలనుకోవడం, చేయ ప్రయత్నించడం, చేయలేక చేతులు కాల్చుకుని ఊరుకోవడం జరుగుతూ ఉంటుంది. ఊళ్ళో, అన్ని హోటల్లోకీ వచ్చిన ప్రతి కొత్తసినిమాకు ఫస్టు టిక్కట్టుకొని, రానుపోను రిక్షాలకు ఖర్చు చేసి, నిద్రపోకుండా ఉండాని కాఫీయో, కిళ్ళీయో తీసుకొంటూ ఉండడానికి, అంత డబ్బెక్కడిది? వెళ్ళకపోతే ఇతరులేమేనా అనుకుంటారేమో అనే భయంతో ఎంతకాలంవెళ్ళడం? చేతిలో డబ్బు తక్కువగా ఉంటే రిక్షాలు మానకూడదా? బల్లమీద కూర్చుంటే నామోషీయా? సినిమా సంగతికేంగాని, కొత్త రకం గాజు లొచ్చాయంటే వాళ్ళసొమ్మేంపోయింది? పక్కవాళ్ళంతా "అబ్బా! యివి బాగున్నాయమ్మా" అంటూ మెప్పుకుతినేస్తారు. ఎవళ్ళేనా కొత్తగుడ్డకట్టుకుంటే ఆ రకం, మనమూ కట్టాలనుకోవడం తప్పదు గదా! ఈలాగ గుడ్డలదగ్గరనుంచి పౌడర్లదాకా, చెప్పులదగ్గర్నుండీ సినిమాలదాకా — ఒకటేమిటి? అన్నిరంగాల్లోనూ, భాగ్యవంతుల్తో సరితూగలేక, భాగ్యవంతుల్లాగ పైకి కనబడాలని యెత్తులు వేస్తూ ఎంతకాలం జీవించడం? పైపై మెరుగుల్లో, ఎంతకాలం బ్రతకడం? తాహతు మించి పైకెగరాలనుకోవడం, చివరకు బోల్తాపడడం — తప్పనిసరి ఔతోంది — పోనీ, —

కష్టపడే శ్రమజీవుల్లాగ జీవిద్దామా? — అంటే అంత క్రిందికి దిగడానికి మనస్సు ఒప్పదు; ఒకవేళ మనస్సు ఒప్పినా, కులం, సంఘం బహిష్కరిస్తుంది; తిరస్కరిస్తుంది. అందరూ, తిరస్కరించే వాళ్ళేగాని, వాళ్ళకున్న కష్టమేమిటో, వీలేమిటో, పరిశీలించి, విమర్శించి, సవరించేవాళ్ళెవళ్ళేనా ఉంటారా? హేళన చేయమంటే చేస్తారుగాని, వాళ్ళ మానాభిమానాల్ని మంటగలిపే ప్రయత్నం చేస్తారుగాని, కించిత్తైనా, తోడ్పడతారా? ఏమిటీలోకం? తమ మానసిక భావాలను లోకంకోసం చంపుకొని ఎంతకాలం కూర్చోవడం? అలా కూర్చోపోతే యేంచేయడం? — అటుపైకివెళ్ళలేక — ఇటుక్రిందికి దిగడానికి వీలులేక త్రిశంకు స్వర్గంగా ఎంతకాలం బ్రతకడం?

నిజమే. పార్వతిమాటల్లో సత్యం లేకపోలేదు. ఆమె ఎంత పరిశీలించిందో, ఎంత పరితపించిందో. ఎంతమందికి హితోపదేశం చేసిందో, ఏదేనా అనుభవం మీదగాని నగ్న సత్యం బైటపడదు. వయస్సులో చిన్నదైనా. జ్ఞానంలో పెద్దది. విజ్ఞానవృద్ధ కనకనే, ఆవేశంతో. తనభావాలను ప్రపంచానికి చాటాలనీ, ప్రజలను సంస్కరించాలనీ మానవత్వం అంటే యేమిటో వివరించాలనీ మానసిక పరివర్తనం కల్పించాలనీ దృఢదీక్షపూనింది. పట్టిందంటే భల్లూకపుపట్టే. ఏదో కొత్తసంస్కారం జరిగి తీరుతుంది. ఆమె తలంచిందంటే తప్పక దేశం బాగుపడిందన్నమాటే. తానొక ధర్మమూర్తిగా, ఆదర్శజీవిగా గాంధీవంటి మహాత్ములు లోకాన్నుద్ధరించినట్టే, మన్యజాతి ప్రజల మనస్తత్వానికి కొంత సంస్కారం, కొంతవికాసం, కల్గించిందన్నమాటే. వనితాలోకంలోనే సంస్కారావశ్యకత యెక్కువ కనిపిస్తోంది. పూర్వకాలపు వాళ్ళ భావాలకీ నేటికాలపు వాళ్ళ భావాలకీ ఉండేలేదా ఎంతో తేడా — చిన్నతనంలో తల్లిదండ్రులు. యౌవనకాలంలో భర్తా, వృద్ధాప్యంలో బిడ్డలు పోషిస్తారు. కాబట్టి, స్త్రీకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేవని వ్యర్థాలంటే ఆనాటి స్త్రీవ్యక్తికున్న గౌరవస్థానం, స్త్రీలంటే సంఘంలోగల అభిమానం, ఆదరం వర్ణనాతీతం. "మాతృదేవోభవ" అని మాతృస్థానానికి ప్రాధాన్యం

నన్ను బాధపెట్టకండి" అంటుంది. ఆ పిల్ల తెలివికి రోహిణి సంతోషిస్తుంది. నందుడు దానివంక తేలబోయి చూస్తాడు. యశోద అమాయకంగా ఆ పిల్లదానివంక చూస్తుంది. కుంభుడు తన కూతురు ఏమౌతున్నదా అనుకుంటాడు. ధర్మదకు ఏదో చెప్పరాని ఆనందం హృదయంలో తరంగాలు కొడుతుంది. శ్రీధాముడు బలరాముని ప్రక్కనే కూర్చుంటాడు. ఆ బలరాముడు ఎవరితోనూ మాట్లాడడు. ఏదో మహాభారాన్ని మోస్తున్నవానివలె కూర్చున్నట్టుంటుంది కదలడు. శ్రీధాముడు ఒక్కసారి అతని దక్షిణభుజాదండాన్ని అట్లా ముట్టుకున్నాడు. వాడికి ఏదో ఆఘాతం తగిలినట్లయింది. ఆ చేతినుండి ఏదో శక్తి ఎక్కడికో ప్రవహించిపోతున్నది. శ్రీధాముడు నీలదగ్గరకు పోయినాడు. నీల శ్రీకృష్ణుని పాదములను కడుగుతోంది. తన ఉత్తరీయపుకొంగుతో వాటిని అద్దుతోంది. శ్రీధాముడు రాగా అతనివంక చూసింది. అతడు దానిని చూచి సాలోచనుడై వెళ్లిపోయినాడు. వీరి ఈ విచిత్ర ప్రవర్తనం అక్కడ అందరికీ మొదట విచిత్రంగ వున్నా, తర్వాత అలవాటైపోయింది. ముందు ఈపిల్ల ఏమిటి, ఈ పిల్ల చేష్టలు ఏమిటి అనుకున్నవాళ్లుకూడా ఇప్పుడు నీలయందు అనుగ్రహాన్ని చూపిస్తున్నారు. అది వీర్యశుల్క అని విని, దాని తల్లిదండ్రులకు ధైర్యం చెప్పారు. "కుంభయ్యగారూ! ఆ అంబోతులు మా కృష్ణయ్యకుతప్ప ఇంకొకరికి లొంగవు. అందుకే అవి పుట్టాయి. అవి పూతనకంటే, శకటునికంటే, కాళీయునికంటే గొప్పవికావు. ఈ పర్వతాన్ని చూస్తున్నారుగా! మా కృష్ణయ్య వాటిని అవలీలగా ఊపేస్తాడు" అంటారు. "అవును, అవును" అంటాడు కుంభుడు. ఒకరోజున ఒకవృద్ధగోపిక ధర్మదతో అంది: "ధర్మదమ్మగారూ! మీ నీల మా కృష్ణయ్యకోసం పుట్టిందండి." "అవును తల్లీ! అవును" అంది ధర్మద.

వర్షం వచ్చిన మొదటిరోజున ఏ కాస్తసేపు గోపకులు ఏమి కష్టపడ్డారోగాని, ఆ మరుక్షణంనుంచి అంతా భూలోకంలోలాగానే వారి జీవితం సాగిపోతోంది. గోవులు మామూలుగా ఆ గిరిక్రింద సంచరిస్తున్నాయి. వాటికి మేతకొదువ ఏర్పడటంలేదు. నందుడు తక్కిన గోపకులను వెంటబెట్టుకొని, కొండ అంచులకు పోయి, వర్షప్రవాహాలలో కొట్టుకుపోతున్న చెట్లను, లతలను, కొట్టుకువచ్చి, పశువులకు మేతను సమకూరుస్తున్నాడు. ముసురులో మేలిజాతి గోవులు కసవు ముట్టవు. ముట్టిన గోవులు ఏమున్నావుంటే, అవి సహించి సహించనట్లు కసవు మేస్తున్నాయి. నందుడు తెచ్చాడుగదా అని అట్లా ముట్టుకొని వదిలివేస్తున్నాయి. వరదలువచ్చిననాటి యమునవోలె, ఆ వర్షప్రవాహాలు గిరిని ఆనుకొని ప్రవహిస్తున్నాయి. గోపకామినులు మామూలుగా నీళ్ళకు పోతున్నట్టే బిందెలతో గిరి అంచులకు పోతారు. నీళ్ళు తెచ్చుకుంటారు. యశోదకు ఇదే విచిత్ర మనిపిస్తున్నది. ఈ బిడ్డడు పుట్టినదగ్గరనుంచి ఎన్నో అద్భుతాలు చేస్తున్నాడు. ఇతడు తన బిడ్డడేనా? ఆ ఆలోచన రాగా యశోద మనస్సు ఆవర్తాన్ని పోలి పరిసంభావన సంకులం అయిపోతుంది. బయట అంతా చీకటిగా వుందిగాని, గిరిక్రింద పట్టపగలుగా వుంది. చెట్లను, కొమ్మలను, వల్లియలు వేసి పట్టుకువచ్చి, నరికి, గోపకులు నెగళ్ళు వేశారు. అవి అహోరాత్రాలు అట్ల నిత్యాగ్నిహోత్రులైన శ్రోత్రియుని గృహంలో త్రేతాగ్నులను పోలి, వారికి, వారి గోవులకు సుఖావహాలు, సుఖాస్పదాలు అవుతున్నాయి. గోపికలతోకూడా నీల నీళ్ళకుపోతుంది. సూర్యోదయం అయినవేళ ఏదో, అవస్థ ప్రళయంలో ఎట్లా తెలుస్తుంది? కాని నీల సూర్యుని కన్న ముందు లేస్తుంది. వాన ముసురుపట్టిన రోజులలో పగలు వెలిబూడిద వెలుగు చిమ్ముతూ వుంటుంది. అంతకు ముందే నీల మేలుకుంటుంది. అసలు అది నిద్రపోతున్నదా! అని అంతా అనుకుంటారు. కృష్ణుని సేవలో దానికి రోజులు గడిచిపోతున్నాయి. తెల్లవారినట్లు ఎట్లా తెలుసుకుంటుందో, అందరికన్నా ముందుగా లేస్తుంది. కొండ అంచులకుపోయి నీరు తెస్తుంది. కృష్ణునకు, ముఖం కడుక్కునేందుకని, దగ్గర నీళ్ళు పెడుతుంది. మొదటిరోజున అక్కడ

(62-వ పేజీ చూడుడు)







# రాబిన్ హుడ్

## 14

చాలా కాలం గడిచిపోయింది.

వసంతాలెన్నో పూలు దూసి పోసినాయి. వానలెన్నో కురిసి వరదలై పారినాయి. ఎండలెన్నో కాసి పండిపోయింది తల ప్రతి వీరుడికీ- కొన్నేళ్లు గడిచాయి!

కొన్నేళ్ళక్రితం బందిపోటుగా పేరుపడ్డ రాబిన్ ఆ పేరుతోనే పలుగురికీ తెలుస్తున్నాడు. కాపోతే "ఆ దొంగ లేడూ చాలా మంచివాడండీ" అనో, "ఖర్మచేత దొంగ పుటక పుట్టాడు గానీ, దొరలకొంపలో పుట్టాల్సినవాడు" అనో—వేనోళ్ళ పరగణా చెప్పుకునేది. పుటక, బతుకూ, దొంగపిటగానీ మనిషి మంచివాడేట! ఖచ్చితంగా దొంగ అనేవాళ్ళెంతమందో, దొర అనేవాళ్ళూ అంతమందీ ఉన్నారు. ఇంతమందీ ఓ మంద లెమ్మనుకుని పోనీమ్మనుకుని హాయిగా ఉన్నాడు రాబిన్.

ఓ రోజున రాబిన్ హుడ్ ప్రొద్దున్నే తూర్పు చెట్టున ఎర్రటి ఎండపూసిన వేళ—ఆయెండకు మెరమెరలాడుతూ మెరుస్తున్న గడ్డంతో సహా—తనరాజ్యం నాలుగువైపులా తిరిగి రావాలని బయలుదేరాడు.

ఇప్పుడతనిరాజ్యం అంటే షెర్వుడ్ అంతానన్నమాట. అందులో మారుమూల మందీ మార్బలం అంతా, అనాథులంతా, అగతి వాళ్ళంతాకలసి వెయ్యిమంది ఉంటారు. ఆ రాజ్యంలో ఆకలికి చోటు లేదు. అన్నానికి లోటు లేదు. బద్ధకానికి బద్ధవిరోధులు వీళ్ళంతా— ఎంతపాటనయినా పాట పాడినట్లు చులాగ్గా చలాగ్గాచేసేస్తారు. ఆటలో అరటిపండుగా హాయిగా ఉంటారు. ఉన్న జింకల్ని చంపి దిట్టంగా తినటం మానేశారు

**శుభశ్రీ**

కావలసినంతవరకే చేస్తారు ఏ పనయినా సరే! వేటబట్టలు, కుచ్చుటోపీలు, బాణాలు డోళ్లు తయారుచేసి పరగణాలో అమ్ముకుని డబ్బులు సంపాదించే వాళ్లు. మదించిన ఆసాముల్ని గుర్రాలుదించి పొగరుదించి, దోచుకుని ఖాళీసంచి చేతికందించి సాధించి విడవటం వీళ్లు మానలేదు. దిక్కులేనివాళ్లకు తిండి పెట్టాలి. అందుకని అది ఎక్కువైన వాళ్ళకు అజీర్ణం చేయకుండా ఆ కాస్తా లేనివాళ్ళకు పెట్టేవాళ్లు వీళ్లు. ఇది చూసి దొంగలని పేరుపెట్టేవాళ్లు బైటివాళ్లు. రాబిన్ హుడ్ షెర్వుడ్ లోకి వచ్చిన నాటికేళ్ల నించీ ఇదే వరస! పరగణా గుసగుస!!

వీళ్లందర్నీ చూడాలని రాబిన్ బయలుదేరాడు అతను గుడిసెల మధ్యగా వెడుతుంటే పేదా సాదా అంతా ఆ దొరకి వంగివంగి దణ్ణాలు పెట్టారు.

తనరాజ్యం అంతా కలయజూసి మధ్యలో ఓ చెట్టు మొదట కూచున్నాడు. అంతావచ్చి అక్కడ చేరారు. ఆడా, మొగా, పిల్లా, పెద్దా అందరూవచ్చి రాబిన్ యెదుట నిలబడ్డారు. అందులో ఓముసలమ్మ రాబిన్ దగ్గరగా వచ్చి కూచుంది. "మనవడా, నువ్వూ అప్పుడే తాతయ్యవవుతున్నావు, తల పండిపోతోంది ఏపుదప్పి, పళ్ళంతా కొంత జంకింది. ఆ దేవుడు నిన్ను చల్లగా నాలుకాలాలపాటు కనిపెట్టి ఉంటే ఈ పేదా సాదా హాయిగా చల్లగా వుంటారు. ఈ మధ్య బాణం పట్టటమే మానేశావు పోనీలే—కానీ నీ అంత వీరుణ్ణి మరోణ్ణి నువ్వు యిప్పట్నించే తయారు చెయ్యాలి. లేపోతే చూడు-ఈ పిట్టలగతి ఏమవుతుందీ" అన్నది ఆ ముసలమ్మ

ఆమాటకి రాబిన్ హుడ్ కళ్ళు చిట్లించి విశాలంగా నవ్వాడు.

అప్పుడు అతని మొహమంతా ముడతలు పడ్డది. ఆ ఒక్కొక్క ముడతా ఒక్కొక్క పుస్తకంలాగా వుంది ఎంతో చరిత్ర, ఎన్నో కథలు ఆ ముడతల ముడతల మధ్య




ఉన్నాయి. ఆ నవ్వులో ఎంతో వెలుగు కనిపించింది. ఆ కళ్ళలో చురుకుదనం, వేడిఉన్నాయి. ఎన్ని ఎండలు కాశాయో తల్లో అన్ని వెంట్రుకలు నెరసిపోయాయి!

రాబిన్ హుడ్ తలవంచి కొంచెం ఆలోచించాడు. "చూడు మునలమ్మా. నే నిన్నాళ్లూ చెప్పలేదు గాని మీ అందరికీ మల్లేనే నాకూ దేముడున్నాడు. మీ రంతా చీటికీ మాటికీ తలుస్తారు-దేవుణ్ణి పిలుస్తారు. నేను పుట్టింతర్వాత అటువంటి పని యెప్పుడూ చెయ్యలేదు. నాకూ దేముడు పిలిస్తే పలికేవాడేమో! మరి తప్పు నాదే. నేనూ పిలుస్తాను. అసలు పిలవకుండా ఉండను నా జీవితంలో చిట్టచివరికి ఈ దే కొమ్ము బూర దేవుడి కోసమే!

ఇంతకీ మనదంతుకి ఓనాయకుణ్ణి తయారు చెయ్యమంటారంతా! అంతేగా. అది నా చేతులో లేదు. ఆమాట కొస్తే మిమ్మల్నందర్నీ నేను తయారుచేశానా? నన్ను, మిమ్మల్ని ఎవడు తయారు చేశాడో వాడే వస్తాడు. ఆపని చేస్తాడు.

నరేగాని మీ అందరికీ ఏమిటీ ఆలోచన? రాబిన్ బతికుండగానే మొదలెట్టారేమిటి?" అన్నాడు.

ఆ మాటకి అంతా సిగ్గుపడ్డారు. "ఈ ముసిల్దొకటి చేస్తుందీ" అన్నాయన్ని షేవరాయుళ్ళు. లిటిల్ జాన్ మొహం చిటమటలాడిస్తూ మునలమ్మకేసి చూశాడు. ఫ్రయర్ టక్ మాత్రం ఏంమాట్లాడలేదు.

అప్పుడు మళ్ళీ మునలమ్మ అందుకుంది. "ఇదెక్కడి గోలరా! నన్ను మిర్రిమిర్రిచూస్తారుమీ! వెర్రికూలా! నేనన్న మాటల్లో తప్పున్నట్టు దెప్పుతారెక్కడిగోల! నే నన్న మాటకి చిలవలూ పలవలూ కల్పిస్తారేమిటి? నాకే వెహారాలుచూస్తే వళ్లు భగ్గున మండుతుంది.

అయినా నాకు తెలీకడుగుతాను? ఏంచూసుకున్న ధీమా మీ అందరికీ. రాబిన్ పెద్దవాడౌతున్నాడే--మళ్ళీ అల్లాంటివాడు ఒఖ్ఖడున్నాడూ మీలో. అందుకని నా కెందుకని ఊర్కోకుండా పెద్దదాన్ని ఓమాట అంటే ఇంత పొడుచుకు రావాలీ? ఛ లేవాళ్లే. నా కెందుకొచ్చినబాధ. కాని ఒక్కటి గుర్తుంచుకోండి. ఈ షెర్ వుడ్ రాబిన్ చెట్టు పడిపోగానే



హాంగర్ మంగర్ మంత్రగాడు ఒక్కబిగిని దౌడాయించాడు.

తరగణాల్లో కలిసిపోతుంది. అప్పుడు మీ బిడ్డలు—వాళ్ళబిడ్డలు షెరిఫ్ అడుగులకు మడుగులొత్తుతూ పడి ఉంటారు. ఈ బీదా బిక్కీ దిక్కూ మొక్కూ లేకుండా పడి ఏడుస్తారు. వాళ్లెప్పటి కయినా ఏడుస్తారనీ, ఏడవక తప్పదనీ, ఏడవకేంచేస్తారనీ నేనిప్పుడే కన్నీళ్ళు కారుస్తున్నాను. ఏడుస్తున్నాను" అన్నది ఆముసలమ్మ!

ముసలమ్మ గుండెలో మొసలం ఇప్పుడు అందరికీ అర్ధమైంది. "నిజం, నిజం—నువ్వన్నది నిజం. నిజం నచ్చేపోటం సహజం! రాబిన్ హుడ్ చెట్లల్లే నిలబడితే మనమంతా పిట్టల్లే గుట్టచప్పుడు కాకుండా పడున్నాం. కానీ ఆ ఒక్క చెట్టూ ఎప్పుడూ నిలబడుతుందనుకుంటే చేటుమనకే! మరో చెట్టు—ఇంకో చెట్టు—ఇలా చూసుకోపోతే లాభం లేదు. రాబిన్ పేరు నిలబెట్టే మరో చెట్టు మనందరికీ అవసరం కాదా? ఏమిటలా చూస్తారు?" అన్నాడు ఫ్రయర్ టక్!

"అవల్ రైట్. అయితే ఏవంటావ్" అన్నది ఓ నిక్షేపం!

'నువ్వు మనదండుకు ముందుండి నడిపిస్తావా?' అన్నాడు ఫ్రయర్.

"ఓ! నడిపిస్తాను. నేనడిపించేదేమిటి? దేవుడు లోపలుండి నడిపిస్తాడు—దేవుడు! దేవుడంటే రాబిన్ హుడ్ అన్నమాట", అన్నాడు నిక్షేపరాయుడు.

"సెభాష్—అలా వుండాలి అన్నాడు ఫ్రయర్.

రాబిన్ హుడ్ చల్లగా నవ్వాడు. ఇంతలో ఓ నిక్షేపరాయుణ్ణి నలుగురు వీరులు కలిసి మోసుకొచ్చారు. "దొరా! మన అడివి దార్నపడి ఓ మాయబిచ్చగాడువచ్చి ఇంతపనీ చేశాడు" అంటూ నిలువునా ఆ నిక్షేపరాయుణ్ణి పడుకోబెట్టారు!

రాబిన్ ఆదుర్దాగా నిక్షేపం ముక్కుదగ్గర చెయ్యిపెట్టిచూశాడు ఊపిరి ఆడుతునే ఉంది.

"ఏంజరిగింది" అన్నాడు.

"వాడెవడో మాయల ఫకీర్. చూట్టానికి బిచ్చగాడు. మరీమాస్తే పిచ్చివాడు. ఆ వచ్చినోడు వచ్చినోడువచ్చినట్టు పోవచ్చా. ఊంహుం వళ్ళు మందంగా ఉందిగానల్లు—నోటితో నవ్వుతూ నొసలుతో వెక్కిరిస్తూ మా మధ్యనించే పోయాడు. ఎహ దాంతో మనవాడికి వళ్ళు భగ్గున మండింది. గిర్రున తిప్పి ఛరున ఓటి ధాటీగా తగిలించాడు. బుగ్గలు బన్ రొట్టెల్లే దెబ్బకు దిబ్బున వాచిపోయాయి. తాటవూడి పోయింది నాయకా. అక్కణ్ణించి వాడు తికమక మకతికలై పోయి హామాంతం దొణా దొణా నాలుగుమంత్రాలేవో చదివేశాడు. నిక్షేపం పాపం చాపచుట్టలా నిలువునా కూలిపోయాడు. మా గుండెలు గుభేల్మన్నాయి. వాడు కాకిలాగా క్షణంలో కనుచాటై పోయాడు." అన్నాడు.

'ఆ హూష్ కాకి ఎకాఎకీఇటేపడి చక్కాపోయాడు. వీడిదుంప తెంప' అన్నది మరో ఘటం!

ఆమాట వింటంతోటే రాబిన్ హుడ్ ధడాల్న పరిగెట్కుంటూ బాణం బనాయించి వెళ్ళిపోయాడు. తతిమ్మా వాళ్ళుకూడా వెనక్కాలే వెళ్లారు. వీళ్ళునగం వెళ్లేటప్పటికి రాబిన్ వాణ్ణిజుట్టుపట్టుగుని ఈడ్చుకు రావటం అంతా చూశారు.

"అదుగో దొర—హూష్ కాకీగాణ్ణి పట్టుకొస్తున్నాడు" అని ఎగిరి గంతేశారు దండులో వీరులు.

వాణ్ణి పట్టుగొచ్చి ఫటేల్ మని ముందొకటిచ్చుకున్నాడు రాబిన్ హుడ్. నరానరి వళ్లు చల్లబడ్డ నిక్షేపరాయుడిదగ్గరికి తీసికెళ్ళాడు. "విప్పు. ముందు వీడి మంత్రకట్టు విప్పు" అన్నాడు. బిచ్చగాడు బిక్కమొహంవేసి "హాంతర్ మంతర్" మంటూ మంత్రాలు నాలుగుచదివాడు. రెండుసార్లు ఆవలించి లేచికూర్చుని-'ఏమిటిదంతా' అన్నాడు నిక్షేపం.

'ఏంలేదు నీఘనకార్యమే' అన్నాడు ఓ వీరుడు.

'అరే మనవాడికేం నిక్షేపంలా ఉన్నాడు! అన్నాడు మరోడు.

బిచ్చగాడి చేతులో మంత్రదండం రాబిన్ చేతులో ఉంది. "దండం పెట్టి దండం తీసుకో-ఫో" అన్నాడు రాబిన్. "దండం నాకెందుకు? దండగ-నేనూ ఈ పాడుపనులు మానేసి మీతోవుంటా—నాదే పొరపాటు. నన్నూ మరి మీతో కలుపుకోండి" అన్నాడు హూష్ కాకి!

అందరూ ఒక్కసారి బిగ్గరగా నవ్వి 'హూష్ కాకీ' అని ఎగిరిగంతేశారు.

"ఇదుగో హాంతర్ మంతరూ మనతడాఖం తెల్సుకో. పెద్దంత్రం, చిన్నంత్రం చూసో - మంత్రదండంవిసుర్ పుచ్చు కవతలపారెయ్. బుద్ధిగా ఉండు. దండులో ఉంటే దండిగాతిండి, తిండికొద్దీ కండ, కండతో గుండె, గుండెతో గుణం,

(59-వ పేజీ చూడండి)

చెట్లమీదనుంచి చూసున్నట్టు వుంది.

మాంఛి వేగంతో వెళ్తోంది రైలు. ఆ పతిత సమాజంనుంచి వస్తేంత త్వరగా ఉద్ధరిస్తే అంత మంచిదనిగావును. మా పెట్టెలో నా సమాధానంతో నిమిత్తంలేకుండానే పంచాయతీ జరుగుతోంది

కిటికీలోంచి తూర్పువాకిట తెరచుకోటం చూసున్నాను. నా కళ్ళలో ఆమె అశ్రువులు నిండుతున్నయ్. నేనేమీ అనలేకనే ఆమెను! అడిగినప్పుడుకూడా అసహాయతను ప్రకటించనేలేదే! అసలామె వెళ్తున్న ప్రయాణం గురించి నేనేమీ ప్రస్తావన చేయలేదే! ఆమె ఎటువంటిది అయినా కూడా, ఆ మెనిషి నా కళ్ళలో పడటమే నా పుణ్యం అనుకుంటున్నా...కాని ఆమె తన ప్రయాణం విరమించుకొన్నది. అంతే కాదు. నాతో కలిసిరానటంకూడా మానేసింది. మళ్లీ తనదారిన తాను వళ్తోంది. మసక వెలుతుగులో చెట్లు చేమ కనుపిస్తున్నయ్. కొండల వరుసలుకూడా నిద్రలోంచి లేస్తున్నట్టు ఉన్నయ్. ఆకసుమలమున్న ఆ పతితయే వడుస్తున్నట్టు...ఆమె కందకుండా శిఖరాలు ఆకాశంలోకి ఎగురుతున్నట్టు. రైలు చక్రాలు ఆమె మాటలనే నా కోసం తమ వరసల్లో పాడుతున్నాయ్. ఉన్నట్టుండి నా చేతులకు ఎవరివో చేతులు తగిలినట్లు...గాజులు గలగల లాడినట్లు....

"ఇక్కడ కూర్చోవచ్చునా?" అంది హిందీలో...ఎవ్వరో కాదు...ఆ బెంగాలీ యువతి కళ్లు నలుపుకుంటూ...అవతల బెంచిమీంచి వాళ్ల అన్నగారు అంటున్నాడు. "కొన్నేళ్ళు మా చెల్లెలు అక్కడ కూర్చుంటుందిట."

ఎదురుగా, కొంచెం పక్కగానున్న ట్రంకుపెట్టెమీద ఆ యువతి కూర్చొంది. గలగల లాడినయ్ ఆమె చేతిగాజులు. అవి నా గుండెలో మోగినట్టువుంది.

"రాత్రినుంచి ఈ కిటికీని మీరు ఎందుకు వదలకుండా వున్నారో నాకిప్పుడు తెలిసింది!" అని అన్నది.

"ఏమిటది?" అని అన్నాను.

'అంబరవీథిలో విహరిస్తున్నారు!" అని అన్నది.

ఇద్దరమూ నవ్వుకున్నాము. నా నవ్వు మధ్యలోనే తెగిపోయింది.

"ఆ చలాకీ అమ్మాయి ఏదీ?" అని అడిగింది ఇంగ్లీషులో. అన్నగారు కేవలం రాజభాషావాది అప్పట్లో అంతకన్న నాకు కావలసిందిలేదు.

"నా కెదురుగానే కూర్చొనివుంది..." అన్నాను తడుముకోకుండా.

ఆ పాలబుగ్గలు ఒక్కసారి మందారాలైనయ్.

"నేను తెలుగుఅమ్మాయినిగురించి అడుగుతున్నాను" అని అంది.

ఏదో స్టేషన్‌వచ్చింది. తలుపు సందులోంచి రెండు మొండికాళ్లు ముందుకు కుడుచుకోవచ్చినయ్. వాడే. యుద్ధంలో బిరుదుల్ని పొంది. శాంతికాలంలో బిచ్చగాడైనవాడు...నా కేసిచూసి, తటిత్తున గుర్తుపట్టి, "బాబూ! 'దండం'" అని అన్నాడు. వాడి మొండికాళ్లను చూసేటప్పటికి, నాకు కళ్లు రెండూ పోయినట్లువుంది. ఏమీ కనబడ్లేదు.

"అమ్మగారు ఏరండీ ... మా తల్లి... ఎగిగానే అణాపెబ్బులు పడేశారు" అని, బెంగాలీయువతికేసి చూసి, చూపులు దింపుకున్నాడు. చెట్టుకింద చీకట్లో నుంచున్న అమ్మాయి ఈ వెలుగులో కూర్చున్న అమ్మాయి కాదు.

గాలికి వంగయువతి జుట్టంతా రేగుతోంది. అయినా గాలికివదిలేసింది జుట్టును. వాళ్లు దక్షిణాదివాళ్ళలా జుట్టు విషయం దగ్గరనుంచీ నియమ నిబంధనాలను పాటించరు గావును. ఆ పొడుగాటి వత్తుజుట్టులో గూడుకట్టుకొనివుంటె!

ఊరుకోడువాడు. అడుగుతున్నాడు.

"అమ్మగారు ఏరండీ. దణాలు ఆతల్లికి.."

ఈ కుంటివాడికి ఏమైనా ఇవ్వమని అన్నగారిని పురమాయించింది చెల్లెలు. వాడు అటువైపు వెళ్ళాడు. మళ్లీ ఆయువతి అడిగింది ఆ చలాకీపిల గురించి నాకేం తెలియదు అన్నాను. తెల్లవారూ క్షణం నిశ్శబ్దంగా లేకుండా వున్న వాడివి తెలియదంటె ఎలా అని అన్నది. ఈ రైలులో ప్రయాణం చేయలని దిగిపోయినట్లు సూచించాను. అదే బయలుదేరి, మళ్ళీ మధ్యలో ఆగిపోవటమేమిటి" అని అన్నది. నేనేమీ అనలేదు.

"ఒక్కత్తే ప్రయాణంచేస్తోందే! ధైర్యం వున్న మనిషి" అని అంది.

"తోడు లేకుండా మీరు ప్రయాణం చేయలేరా?" అన్నాను.

"అసలలాంటి అవసరమేరాలేదు...కాని ఆ అమ్మాయి ఎలా ఒంటరిగా ప్రయాణం చేస్తోందో! ఏంభయం లేకుండా!" అని అంది.

"ఆ అమ్మాయికి ప్రయాణంలో ఎప్పుడూ ఎవరైనా తోడుఅవుతారేమో!" అన్నాను.

"రైలెక్కినప్పటినుంచి పాపం మీతోడు లభించనేలభించె...కాని ఇంతలో ఎందుకు విడిపోయారు?" అని అన్నది.

అవతలనుంచి అన్నగారు చెల్లెల్ని వచ్చేయమంటున్నాడు. వాడికి పళ్ళపొడి కావాలిట...

పెద్దవంతెన మీదుగా వెళ్తోంది రైలు... కిందనుంచి ఏదో మహానది ప్రవహిస్తోంది... రెండుమూడు ఓడలు తెరచాపల నెత్తుకుంటున్నయ్...ఆ ఓడమీద తెరచాపగా తానే, ఆ పతిత లేచి నిలచివున్నట్టుంది... చటుక్కున తూర్పు ఆకాశంలోని సూర్యబింబంలోంచి నాకేసి చూస్తోంది! ఆకాశానికే ఎత్తిన గవాక్షంలావుంది. ఎవరిదో

ఇంటి యజమాని: కాపురస్తునితో మీరు "ఆరు నెలల బాడుగ చెల్లించ లేదండి. ఇల్లు ఖాళీ చెయ్యండి.

కాపురస్తుడు: "ఏమిటీ! బాడుగ చెల్లించకుండానా! వీలులేదు."

బొటనవేలు నా బొటనవేలుకు తగిలింది. ఉలిక్కిపడి చూశాను. వంగవనిత కూడా ఉలిక్కిపడ్డది. ఒకపుస్తకం చదవాలను కొంటె, తీరాకళ్ళముందు ఉన్నది మరొక పుస్తకమైనట్టు వుంది నాకు.

"చెప్పరుకాదూ...నా చెల్లెలు ఎందుకు దిగిపోయిందో!" అంది. చెల్లెలు ఎలాంటిదో పాపం ఆమెకు ఏం తెలుసు? అవతల అన్నగారు చెల్లెల్ని వచ్చేయమంటున్నాడు.

నా కళ్ళముందు సూర్యకిరణాలుపడి, రైలుగుమ్మంలో ఏదో...ఏదో...మెరిసినట్టయింది...అద్దంమీద రాలినఅశ్రుబిందువుల్లాగా...ఏదో మెరిసింది... రెండు...మూడు ...పగిలిన...రంగుల గాజుల...ముక్కలు ...పడివున్నయ్. కళ్ళముందు ఏడు ఇంద్రధనుస్సులు మెరిసినట్టు... నేలమీద ...దుమ్ములోపడి...లక్ష నక్షత్రాలు... మెరుస్తున్నట్టు...

అన్నగారి ఆజ్ఞననుసరించి లేచిన వంగ యువతి చేతిగాజులు గలగల మన్నయ్...

స్టేషన్ ఏదో వచ్చినట్టుంది...టికెట్టు కలెక్టరువచ్చి కిటికీలోంచి అటు ఇటు చూశాడు. నన్ను గుర్తుపట్టి, చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

'రాత్రి మీవాళ్ళ దగ్గరనుంచి డబ్బు తీసుకోటంలో పొరబాటు జరిగిందండీ... ఎక్సెస్ తీసుకున్నాను...పన్నెండణాలు.."

నేనేమీ అనలేదు...

"ఎక్కడండీ వారు...ఏరండీ...మీరు తీసుకుంటారా...మీరున్నారుగా...తీసుకోండి..." అన్నాడు.

నేను తీసుకోలేదు. విస్తుపోయి అతి వడిగాడు...

"మరి ఆవిడ ఏరండి?"

"నాకు తెలియదండి" అన్నాను.

"అదేమిటండి..."

"అవునండీ...నాకు తెలియదు."

పెట్టెలోంచి దిగుతున్న అతనికాలిబూట్లు పగిలిన గాజుముక్కలపై పడ్డయ్. కదిలినయ్ రైలుచక్రాలు...ఘోషపెడుతున్నట్టు కనిపించింది ఇంజన్...ఎవరెక్కడదిగినా దాని ప్రయాణంమట్టుకు ఆగదు.






సామాన్యంగా ఓ చిన్నదీ చిన్నవాడూ ప్రణయాలు పరటాయిస్తుంటే, మరో చిన్నదో చిన్నవాడో పెళ్లికి అడ్డుపడి సినిమా అంతట పనిచేయటం దేశవాళీ సినిమా కథలలో రివాజు.

ఇటీవలి చిత్రాలలో అనేక విధాల మెప్పు తగ్గ 'పెళ్లికానుక' (వీనస్ పిక్చర్స్) చిత్రంలో 'పాత్రల్లా' ఏర్పాటు కాలేదు. అందులో ఒక అక్క తెలీకుండా తన చెల్లెలు ప్రేమకథలో జొరబడుతుంది; చెల్లెలు అది తెలిసి అక్క కోసం తన సుఖాన్ని త్యాగం చేసి, తాంబచినవాడికి కావలసినది తానే అయినా బలవంతాన అక్కనిచ్చి పెళ్లి చేయిస్తుంది. ఈ విధంగా తన జీవితానికి తనే విలన్ అవుతుంది. అక్క కూడా తన ఆలోచనలవల్లనే తాను బాధలుపడి పోతుంది. పెళ్లి అనురాగద్వేషాలమధ్య ఒకర్ని ప్రేమించి మరొకర్ని పెళ్లాడిన పిల్లాడి జీవితం నలిగి పోతుంది.

## వీనస్ పిక్చర్స్ వారి 'పెళ్లికానుక'

ఆ పిల్లలిద్దరూ తల్లి చాటు బిడ్డలు, తండ్రి చిన్నప్పుడే పోయాడు. ఇద్దరిలోను పెద్ద కూతురు గీత తెలుగు చక్కగా మాట్లాడు తుంది. పైపెచ్చు బహు నెమ్మదస్తురాలు. చిన్న పిల్ల వాసంతి తన్నడం నేర్చుకుంటూ తెలుగు మాట్లాడుతుంటుంది. అంతే కాక అల్లరిపిల్ల. భాస్కరం అనే అబ్బాయిని ప్రేమించి, పెళ్లికి సన్నాహం చేయటంకోసం మెలిగా తన యింట్లోనే అద్దెకు దింపుతుంది. నాలుగు గదుల దూరాయిల్లుపాడ, చాన్నాళ్లాడినవిడిదిలా చేస్తే తేలా అవుతుంది, అక్కకి సంగతి చెప్పా లనుకుంటూ ఉండగా అక్కయ్యే సిగ్గు పడుతూ తాను భాస్కరాన్ని ప్రేమించి నట్టు వెల్లడిస్తుంది. అతన్ని తప్ప మరొకరిని పెళ్లాడనంటుంది. వాసంతి అక్క రోగాన్ని దుఃఖాన్ని దిగమింగి అనునయంగా లాలించి 'పరీక్షని చేస్తూ తననూ పెంచి పెద్ద చేసిన అక్కయ్యకోసం' తన సుఖాన్ని త్యాగం చేయాలని తీర్మానించుకుంటుంది. తన నిర్ణయాన్ని బట్టే భాస్కరాన్ని కూడా బలవంతంచి ఒప్పించి అక్కనిచ్చి పెళ్లి చేయిస్తుంది. తన బలవంతాన గీతని పెళ్లాడినందువల్ల అతను ఆమెను ఆదరించడు. 'త్యాగం చెయ్యగానే సరికాదు; ఆతర్వాత కూడా త్యాగంవల్ల, సాధించవలసిన లక్ష్యానికి అనుకూలంగా నడచుకోవాలి' అని చిన్నా పెద్దా కూడా గ్రహించి సర్దుకుమనే తగ్గది పైనుక్క చెబుతుంది వాసంతి. భాస్కరం వెంటనే పొరబాటు దిద్దుకొని భార్య, ఇటు ప్రేక్షకులూ ఉక్కిరిబిక్కిరి అయిపోయేలా మాంచి బెడ్ దృశ్యంలో ఆమెని సంతోష పెట్టేస్తాడు.

పర్యవసానం శ్రీ ఎల్ ఈ కథను చిత్రించిన పద్ధతినిబట్టి, ఆయా పళ్లి వేళాల రూపకల్పన బట్టి, గీతా భాస్కరుల వివాహంతోనే చిత్రం పూర్తి అయిపోయిందని అని పిస్తుంది. ఇది అద్భుతమైన చిత్రం అని పించే శ్రీగా పట గౌరవం కలుగుతుంది కాని ఇంటర్వెల్ తర్వాత కథ కొనసాగి ఇందాకా వచ్చేసరికి ఇదీ బాగానే ఉందను కోబోలనిపిస్తుంది.

కాని అంతలో వాసంతి, గీతల తల్లి హఠాత్తుగా పోవడం అనగొట్టుకొని కథను కొనసాగ దీస్తుంది. అనాథ అయిన వాసంతి అక్క, బావల ఇంట్లో ఉంటూ, వాళ్ల బిడ్డని సాకుతూ కాలక్షేపం చేస్తుంది. అప్పుడేమో ఓ శివరాత్రిరోజున అక్కకు హఠాత్తుగా జబ్బు చేస్తుంది. ఆమె మంచాన ఉండి 'బావా మరదళ్ల సరసాలను' అపార్థం చేసుకుని అనర్థకాలైన మాటలు అని వారిని పీడిస్తుంది. అవమానాలు సహించ లేని వాసంతి ఆ యిల్లు వదిలి బయటపడి,


హైద్రాబాద్ మూవీస్ వారి 'జల్సారాయుడు'లో జగ్గయ్య, జ్యోతి

## చిత్రలేఖ
### మనసా కంటికి తేకే

"మనసా ఎటులోర్తునే" అన్న త్యాగరాయకృతి పల్లవిని మూడుసార్లు మననం చేసుకుని పైన 'మనసా కంటికి తేకే' అని మహాజనులంతా మనసుకి నిజవుండచేయాల్సిన పరిస్థితి వచ్చింది. లేకపోతే అంతా అయి, మించి మీదపడ్డాక నొప్పులపడటం, ఆపైని విజ్ఞులు జ్ఞప్తికి రావడం బాధపడటం తప్పదు. ఎందువల్లనంటే, మరేం లేదు.—

ఈ మధ్య చిత్రనిర్మాతలు తమ మీదపడ్డ పన్నును ప్రేక్షకుల కన్ను కుంకంగా మార్పించడానికి ప్రయత్నిస్తున్నారట! వాణిజ్యవ్యాపారాల మీద పన్నును వినియోగదారుడిమీద రుద్దటం మామూలుగానే ఈ పరికి తడిసి మోపెడయినట్టుగా పరిణమించి తర్వ రూపాయికి అమ్మేకొనే పరిస్థితులేర్పడాయి. ఇక ఈ కొస్తా కూడా అయిందంటే చెప్పే అక్కర్లేదు.

ఇప్పటికే తిండిగింజలమీద పన్ను, అపరాలమీద పన్ను, అవసర వస్తువు మీద పన్ను, విలాస వస్తువులమీద పన్ను. వినోదపు పన్ను వగైరాలన్ని 'తిలాదానం తిలా పిడికెడు పతుగా'-పంచుకున్న ప్రజలకి నిర్మాతల పుణ్యమా అని కన్నుమీద పన్ను పడి మూలిగే నక్కమీద తాటిపండు పడ్డట్టుగా అవదూ మరి!!

అంతేకాకుండా ఆర్జిస్తే పన్ను, ఖర్చు చేస్తే పన్ను. వినోదానికి పన్ను, విజ్ఞానానికి పన్ను, అమ్మితే పన్ను, కొంటే పన్ను—అయితేగియితే ఇప్పుడు కన్నుమీద పన్ను! ఇంకా ఏమవుతుందో?

ఈ సందర్భంలో మనదో మాట: నిర్మాతల సూచనమీదుగా ప్రేక్షకుల కన్నుమీద పన్ను వేసేక ప్రజల పన్నుమీద పన్ను విధించడం ప్రభుత్వానికి తరవాయి అవుతుంది. అది కూడా అయిందంటే ప్రజలు కన్ను పన్ను పూడబెరికేసుకునే ప్రమాదం సంభవించడంకూడా జరగవచ్చు.

కనుక ఇలాటి ప్రమాదాలు రాకుండా ప్రజలకి (ప్రేక్షకులకి) ప్రమోదాలు కలిగేట్టుగా చూడాల్సిన విధి బాధ్యతలు (నిర్మాతలు, ప్రభుత్వం)మీద ఉంది! ఇంతా చేస్తే నిజానికి నిర్మాతలు చెల్లించాల్సిన సుంకం సొమ్ము ఒక్క ఆర్టిస్టుకి బాగా ఇచ్చే పాటి మొత్తం కూడా కాదు. ఆ విషయం కాస్త గ్రహించుకుని సమగ్రంగా ఆలోచించి సరి నిర్మాతలు నడ్డేలు కావాలి. కానిపక్షంలో ఉప్పువాడూ ఏడ్చేను, పప్పువాడూ ఏడ్చేను, తిరగలిపాటలవాడూ తెల్ల ఏడ్చేను, బొండాలవాడు పార్లి పోయి ఏడ్చేను అన్నది నిజమని నిరూపణవుతుంది!!! —టి. ఎస్. ఎస్. ★

## రాబిన్ హుడ్

(50-వ పేజీ తరువాయి)

అన్నివుంటాయ్ అప్పుడీ హాంటర్ మంటర్‌తో పనేలేదు" అన్నాడు లిటిల్ జాన్

'రాబిన్ హుడ్‌కీ జై' అన్నాడు హాంటర్ మంటర్!

అంతా 'సై' అన్నారు.

"రాబిన్ హుడ్ మన రాజు" అన్నది మునమ్మ.

అప్పుడే పరగణానించి వగరు వగరున వచ్చి డన్ కాస్టర్ పులి జేకడ్ రాబిన్ హుడ్ ముందు ఆదుర్దాగా నుంచున్నాడు. 'ఏమిటి ఖబుర్లు' అన్నాడు రాబిన్.

"ఏం ఉంది దొర. షెర్వుడ్ మాణిక్యంమట్టికరిపి ఆ మొగాడు దేశ దేశాలకి చూపించిన మనతాత్రి, మనరాజు మన్నివిడిచి పెట్టి వెళ్లి పోయాడు. దేశమంతా ఏడుస్తోంది. థేమ్స్ నదిలో పారుతున్నవన్నీ దేశం కార్చిన కన్నీళ్లే" అన్నాడు జాలిగా.

రాబిన్ హుడ్ కంట గిర్రున నీళ్ళు తిరిగాయి. అంతా మోకాళ్ళ మీద నిలబడి రాజు ఆత్మశాంతికి దేవుణ్ణి ప్రార్థించారు.

ఆ రోజులా మబ్బులు పట్టి మసగ్గా, రాజులేని దేశంలా, వెలుగు లేని యింటిలా, ఖుషీ లేని గుండెలా సూర్యుళ్లేని పగలు గడచిపోయింది.

(సశేషం)

స్తుంది. మొదటి చూపులో ఆనంద మనుభవించి మరుక్షణంలో భయకంపితుడౌతాడు. గట్టిగా కండ్లు మూసుకుంటాడు అక్కడ చూస్తూ లేక లోనికి పరుగెత్తుతాడు. అందుకే తనకు తోడు కావాలి. అందుకే తనకు హరి ప్రక్కన లేనిదే ప్రకృతిలో సొగసు కనిపించదు.

తను చిన్ననాటినుండీ అంతే. తను తన తల్లిని చూడలేదు. ఒకవేళ చూచినా తనకు గుర్తులేదు. తను మాతృప్రేమ ఎరుగడు. తనకు తెలిసింది తండ్రి ప్రేమ. తండ్రి తనను పువ్వులో పెట్టి పెంచాడు. తన తల్లి పోయిన తరువాత తండ్రి మళ్ళీ వివాహం చేసుకోలేదు. దానికి కారణం తనే. ఆయన తనంటే అంత ప్రేమగా వున్నా తను ఆయనతో చనువుగా మాట్లాడలేక పోయేవాడు. ఒక తండ్రేమిటి... తను ఎవ్వరితోటి మాటాడలేకపోయేవాడు. తనకు పరాయివారితో మాట్లాడడం అంటే భయం. తను ఎవ్వరితోటి చనువుగా వుండలేదు. తనదొక వింత ప్రకృతి. తను చనువుగా మాట్లాడేది ఒక్క హరితోనే.

ఏవేవో ఆలోచనలు అతని మెదడులో తిరిగిపోయాయి. గడియారం ఎనిమిదిగంటలు కొట్టింది. ఇంకా హరి రాలేదు. హరికై అతని హృదయం తత్తరపడింది. వెంటనే తిరిగి వస్తానన్న హరి ఇంకా రాలేదు. హరి రాకపోవడానికి మదనుడు కారణాలు ఊహించుకున్నాడు.

ఆ డ్రైవరు తన తండ్రి లేకపోతే విపరీతంగా తాగుతాడు. కారును ఏ చెట్టుకైనా ఢీకొట్టలేదుగదా!... మదనుడికి భయం వేసింది. గదిలో విద్యుద్దీపపు వెలుగు దూరపు చీకటిని మరింత చిక్కపరచి కనబడుతోంది. కండ్లు పెకల్చుకు చూచినా ఆ చీకటిలో నలుపు తప్ప ఏదీ కనపడటంలేదు...రివ్వున ఒక గాలి వీచి కొండ క్రిందిలోయలో చెట్ల ఆకులు గలగలలాడాయి. ఆకులను దూసుకుపోయే ఆ గాలి శబ్దం విషసర్పాలు వేనవేలుగా కలిసి బుసలు కొడుతున్నట్లు వుంది. మదనుడు భయంతో వణికిపోయాడు. సోఫాలోనే పడుకుని కండ్లు గట్టిగా మూసుకున్నాడు. చీకటిని చూడలేక కండ్లు మూసుకున్నా లోయలో రేగిన వింత ధ్వనులు వినపడుతూనే వున్నాయి హరి అడుగు సవ్వడికై మదనుడు చెవులు రిక్కించివిన్నాడు. ఎవరూ రావటంలేదు.

తను అనుకున్నట్లు హరికి ఏ ప్రమాదమూ జరగలేదుగదా... ఏ ప్రమాదమూ జరగకపోతే ఇంతవరకూ హరి రాకపోవడానికి కారణం? .. తన తండ్రి ఎన్నిసార్లు గడ్డి పెట్టినా ఆ డ్రైవరు తాగడం మానడు. తనకు వాడంటే అందుకే అసహ్యం. వాడు కారు నడుపుతుంటే తనకు భయం వేస్తుంది మత్తులో

# పిడికలి

(9-వ పేజీ తరువాయి)

వుండి ఇష్టంవచ్చినంత స్పీడు పోనిస్తాడు. ఆ స్పీడుకు అలవాటు పడనివాడైతే గుండె పగిలి చావవలసిందే... హరి ఏదైనా పనిమీద ఆగిపోయి వుండవచ్చుగా. మరి కారైనా తిరిగి రావాలిగా. కారుకూడా రాలేదు. హరి వెళ్ళి అప్పుడే రెండు గంటలు దాటిపోయింది. ఇంతసేపు ఏం చేస్తున్నాడో... ఇంటిదగ్గర.

దూరాన లోయలో గాలులు చేస్తున్న ధ్వనులు వినిపిస్తూనే వున్నాయి. మదనుడు హరినిగూర్చి ఆలోచిస్తున్నాడు. ఈ ఆలోచనతో అతను చీకటిని చూసి పడ్డ భయం కొంత తగ్గింది. తగ్గిందనడంకంటె ఆ భయం అతనిలోనే ఒక ప్రక్కగా ఒదిగివుందనడం న్యాయం. అతనికి ఇంతలో ఒక కునుకు పట్టింది. అతని ఆలోచనలు మాత్రం తెగిపోలేదు. అతని మెదడు ఆలోచిస్తూనే వుంది. అది ఒక విచిత్రావస్థ. అది నిద్ర పట్టీ పట్టని స్థితి. అది ఆలోచనలు తెగీ తెగని సంధిసమయం. ఒక ఆలోచనకూ ఒక ఆలోచనకూ సంబంధం దూరమౌతోంది.

నా కోసం తనన్నా వెడితే బావుణు... ఆ డ్రైవరును తీసేసి ఇంకొకణ్ణి పెట్టుకోవాలి... తన మాట నాన్నగారు కూడా కాదనరు... అయినా వారంటే తనకు ఎంత ప్రేమ? .. హరి హృదయమిచ్చి మాట్లాడుతాడు... వాడు చదువుకు వెళ్ళిన ఆ రెండేండ్లూ తను తోచక తికమక పడిపోయాడు. ఇంత ఆలస్యం ఎందుకయిందో?.. తను వెడదామంటే కారైనా లేదు.. ఈపాటికి ఇంటి దగ్గర బయలుదేరి వుంటాడు.. కొండ రోడ్డంతా మెలికలే. పైగా చీకటి... తనకు చీకటంటే ఎందుకింత భయం?... చీకట్లో మిణుగురు పురుగుల మెరుపులు... ఎంత బాగుంటాయో!... కాని అందం దానిది.. చీకటి లేకపోతే వెలుగు అందం ఎక్కడిది?... ప్రపంచంలో చీకటి భాగమే ఎక్కువ వుండాలి... అమావాస్య నాటి నక్షత్రాలు అందుకే బాగుంటాయి...

ఏవేవో ఆలోచనలు మెదడులో తిరిగిపోతున్నాయి ఒకదానికి ఒకదానికీ సంబంధం లేదు. అతనికి నిద్రపట్టింది. అతనిని పిలవడానికి వచ్చిన నౌకరు అతను నిద్రపోతుండటం చూచి లైటు ఆర్పి వెళ్ళిపోయాడు. హరి రాలేదు. మదనుడు నిద్రలో కూడా తనకు తెలియకుండానే హరి రాకనుగూర్చి ఆలోచిస్తున్నాడు. ఆ ఆలోచనలకు రూపకల్పన చేస్తోంది అతని మెదడు—'హరికై మదనుడు ఒక వీధి వెంట వెడుతున్నాడు. వీధికి రెండు ప్రక్కల వరుసగా విద్యుద్దీపాలు వెలుగుతున్నాయి. ప్రతి రెండు దీపాలకీ మధ్య చీకటి వ్యాపించి వుంది. ఆ ప్రదేశానికి వచ్చేటప్పటికి మదనుడికి ఎందుకో భయం వేస్తోంది. త్వరగా అడుగులు వేసుకుంటూ నడుస్తున్నాడు దూరాన గాలి దూసుకుపోతూ కొల్లుచేసే ధ్వని. అప్పుడప్పుడు కారు హారన్ల శబ్దాలూ వినవస్తున్నాయి.

అతను ఒక మలుపు తిరిగాడు. అది తను నడిచి వచ్చిన దానికంటె కొంచెం చిన్న సందు. ఆ సందులో మధ్యగా ఒక వీధి దీపం వెలుగుతోంది మలుపు తిరిగి చోటు అంతా చీకటి. మదనుడు గుండెలు బిగబట్టుకుని గబగబా అడుగులు వేశాడు. లైట్ స్తంభం దగ్గరకు వచ్చాడు. ఆ స్తంభానికి ఎదురుగా ఒక పెద్దమేడ. మేడ పైభాగపు గదులలో వెలుగుతున్న దీపపుకాంతులు కిటికీలగుండా వెలికివచ్చి గదులలో ఎవరో వున్నారని తెలియజేస్తున్నాయి.

మదనుడు గేటుగుండా మేడలోనికి వెళ్ళిపోయాడు. ఎవరో అతనిని ఆపారు. అతను వెనుదిరిగి చూశాడు. కొండంత దేహంతో భయంకరంగా వున్నాడొక వ్యక్తి. వాని కండ్లు మెరిసిపోతున్నాయి. వాడు తనవంక వురిమి చూశాడు. ఆ చూపులో ఎక్కడికి అనే ప్రశ్న ధ్వనించింది. తను వణికిపోయాడు ఏదో సమాధానం చెప్పబోయాడు. ఏదో చెప్పాడు. వాడు తనను లోపలకు నెట్టి పొమ్మన్నాడు. తన కాళ్ళు వణికిపోయాయి."

స్వర్గానికి వేసిన నిచ్చెనలా మేడమెట్లు తలచుకోలేనంత ఎత్తున వున్నాయి ఆ మెట్లు తను ఎక్కలేదు. అయినా మెట్లు అంత ఎత్తున ఎట్లావున్నాయో!...ఎక్కడం ఎట్లాగా అని ఆలోచిస్తూ అక్కడే నిల్చుండిపోయాడు. మరుక్షణంలో తను మేడమీద వున్నాడు. తను ఎట్లా మెట్లెక్కాడో తనకే అర్థంకాలేదు. అంతా అయోమయంగా వుంది. అది హరి ఇల్లు కాబోలునని అనుమానం కలిగింది. తను హరికోసం బయలుదేరి ఇక్కడ కెందుకు వచ్చానా అనుకున్నాడు. తనకు ఎదురుగా ఒక తలుపు కనిపించింది. తను వెళ్ళి తలుపు తోశాడు.

అది హరి గది. తన మనసు కొంత కుదుటపడింది. హరికోసం గదిలోకి చూశాడు. హరి ఒక కుర్చీమీద కూర్చున్నాడు. అతను ఏదో పండు చాకుతో ఒలుస్తున్నాడు. తన్ను చూచి ఒక నవ్వు నవ్వాడు. తన కెందుకో ఆ నవ్వు కొత్తగా తోచింది తన కెందుకో వికృతంగా నవ్వినట్లనిపించింది. హరి ఎందుకట్లా నవ్వాడా అని ఆలోచిస్తూ అడుగులు లోపలకు వేశాడు. హరి లేచి తనదగ్గరకు వస్తున్నాడు. అతని ముఖంలో ఏదో గాంభీర్యం వుంది. ఎప్పుడూ నవ్వు నవ్వుతుండే హరి ఇట్లా వున్నా

# హరివంశం

(47-వ పేజీ తరువాయి)

ఆ నీళ్ళు ఎలగా పోశారో తెలియక యశోద, ధర్మద, నందుడు మొదలైన వాళ్ళంతా ఇదయిపోయినారు. ఇదికూడా ఏదో మహాత్మ్యమే నేమో అనుకున్నారు గోపకులు, గోపికలు. రోహిణి కృష్ణునివంక చూసింది. తలి వెనుక పక్కన వున్న నీలను చూచింది. ఆ కృష్ణుడు చిరునవ్వు నవ్వినాడు. ఆ నీల సిగ్గుపడింది. రోహిణికి అర్థమయింది. "పిల్ల ఏమో అనుకున్నాను. అయినా అట్లా నీళ్ళు పెట్టి పూసుకుంటే ఏమైనట్లు! పిల్లవాడు పూరికే వున్నాడా యేమిటి! సరే నాయనా! ఇవ్వాళ్టికి నేను ముఖం కడుగుతాను ఇదిగో నీళ్ళు. అటా ఈ నేతో పుచ్చుకో, నా చేతుల్లో పోస్తూవుండు. అది. ఇదిగో పిల్లా! రేపటినుంచి ఈ పని నీవు మానుకోవలసిందే" అన్నది. అని రోహిణి కృష్ణుని ముఖం కడిగింది. ఒళ్ళు తుడిచింది. ఆ ముగుపాటినుండే నీలయే ఈ అన్ని పనులు చేసింది శ్రీకృష్ణుడు దానిని కాదనలేదు. ఎవ్వరూ కాదనలేదు. అంతా దాని అనురక్తిని, భక్తిని చూచి మెచ్చుకున్నారు. "అవును! భార్యకాబోతున్న మేనమామ కూతురు! ఈ మాత్రం చేయవద్దా" అని వృద్ధగోపికలు అన్నారు. అంతటి అద్భుతం అక్కడ తమ జీవితాన్ని విభ్రమం చెందిస్తూ వున్నా, వారిలో సాంసారిక జీవన సౌభాగ్య సౌందర్యాలు పాడుపడిపోలేదు. వారి సాంసారిక జీవనానికి, ఆముష్మిక జీవనానికి భేదం లేదు వలె వుంది. అనుక్షణము వారు శ్రీకృష్ణపదనిగడితముఖులు; అనుక్షణమువారు శ్రీకృష్ణ మహిమానువర్ణన తత్పరులు; అనుక్షణము వారు శ్రీకృష్ణప్రియా మధుర పరిచర్యా సమాపాదిత సంతోషమానసాంతులు, వారి జీవితం ఆ ఏడురోజులు శ్రీకృష్ణ కైంకర్యంగా సాగిపోయింది. ఏడురోజులు గిరిగృహం మహోద్యానవాటికను పోలి అనుత్తమ హాయినొసగిన పరితృప్తి పొందినవారై పాపలింది. బయట ఇంద్రుని జడిగాలిగాని, లోపల పుష్పవాటుని తెలియలేదు బయట ఆసారధారాపాతంగాని లోపల అపారధారాకర్షణం లేదు. బయట పిడుగులు పడటంగాని, లోపల ఇడుములు అన్నవిలేవు. గిరి కింది బృందావనాన్ని బృందారకలోక మందారకుడు, సహస్రనేత్రుడు, ఏమీ చేయలేకపోయినాడు

ఏడోరోజున ఇంద్రుడు తన బలాహక బలాలను ఉపసంహరించివేశాడు. అతని ప్రయత్నం నిష్ప్రయోజనం అయిపోయింది. ఆకాశం నిర్మేఘమై, నిర్మలమై, [illegible], సూర్యకాంతికి భుజగసదృశమై నితాంతమైన నిజకాంతియుతో తిరిగి [illegible] లింది అకాల వర్షాగమం వల్ల చెలువలు కట్టిన నీళ్ళు వాకలంపడి, వెలియబారగా, తిరిగి తృణోత్కరాలతో బృందావనం ఇంపెసలారింది. పొదలలో పచ్చదనంతో తీగలు తిరిగి కొనలలో కొంకులు తేరాయి. తరువులు తిరిగి మెత్తని ఇగురాకులను తొడిగి చల్లగ ఊపిరి రంగస్థలాలై ఉల్లసిల్లాయి. ఏడు అశ్వాలతో పూన్చిన రథాన్ని అనూరుడితో తోలించుకుంటూ వచ్చిన దీప్తిమద్భాస్కర దేవుడు అహస్కరాలయిన తన కిరణాలతో బృందావనంలో సర్వ స్థావర జంగమ భూతప్రపంచాన్ని స్ప్రాణించి మేలు కన్నా మహాత్మ్యపూర్ణమైన గోవర్ధనగిరికి ప్రదక్షిణించాడు. గోపాలకపునగోపాలోత్సవం చరితార్థమైంది. గోవులు విశదాలై నగచర మనోజ్ఞ సంప్రసాదితను నిప్పు విగిలాయి. శ్రీకృష్ణదేవుడు సావరాత్మకమైన గోవర్ధనగిరి ప్రదేశాన్ని తిరిగి స్వస్థానంలో స్థాపించాడు. ఆ అద్భుతాన్ని తిలకించి గోపకులు అక్కడే నిలుచుండిపోయినారు. గోవులు కదలలేదు శ్రీకృష్ణుడు వారి దిక్కు మందస్మితం చేశాడు. బలరాముణ్ణి చూచి "రామా! అందరిని ఇళ్ళకు చేర్చు. నేను కొంతకాలం ఆగివస్తాను" అన్నాడు. అప్పుడు అందరికి అతని అభిమతం తెలిసింది. అంతా కదిలి వెళ్ళారు. శ్రీకృష్ణుడు మాత్రం గోవర్ధనా గమనం చేశాడు. అక్కడ చక్కని ఒక ఉన్నత ప్రదేశంలో, సమభాగవుపై ఒక్కడు ఆసీనుడైనాడు. క్రింద గోబృందాలు గోపాల బృందారకులు కదిలిపోతూ వుంటే, చూస్తూ, నాలోచనుడై కూర్చున్నాడు. శివుడు, వరగుడు, విభుడు గోవర్ధన సింహాసనాసీనుడై గోలోకాన్ని ఆలోకిస్తూ కూర్చున్నాడు.

★

---

తెమిటా అనుకున్నాడు. హారి మళ్ళీ నవ్వాడు. ఆ నవ్వు మరీ వికృతంగావుంది. అతను హారి కాదేమోనని తను సందేహించాడు

అతను హారి కాదు...తన గుండె దడదడ కొట్టుకుంది. తను పణికిపోతున్నాడు. ఆ వ్యక్తి తనదగ్గరకు వస్తున్నాడు. అతని చేతిలో కత్తివుంది...అతను...అతను...తను మేడ క్రింద చూసిన వ్యక్తి. వాడు గట్టిగా నవ్వాడు అది ప్రళయసమయంలో మేఘ గర్జనలా వుంది. తను వినలేక చెవులు మూసుకున్నాడు. వాడు బలంకొద్దీ తనను పొడవబోయాడు...తను తప్పుకున్నాడు వాడు కింద పడిపోయాడు ... తన చేతిలో కత్తివుంది!.. తను వాడిని పొడిచాడు...కసితీర పొడిచాడు ... రక్తం చిందింది. తన ఒంటి నిండా రక్తం చిమ్మింది...వాడి ముఖమంతా రక్తమయమైంది...గదిలో అంతా రక్తం... ఎటు చూసినా రక్తం తను భయంతో కంపించిపోయాడు ఎవరైనా వస్తున్నారేమోనని తలుపువంక చూశాడు. ఎవ్వరూ రావటంలేదు

క్రిందపడిపోయిన వ్యక్తి కదిలాడు ఆ కదలికలో అతని ముఖం తనకు స్పష్టంగా కనిపించింది. అది...ఆ ముఖం...హారిది!!..

# పిడికిలి

తన వ్యాసమూ వృదన తుం... ఆగిపోయింది. కెవ్వున కేక వేశాడు. అంత కేక పెట్టినా ఎవ్వరూ రాలేదు. తన కండ్లవెంట నీళ్ళు కారిపోయాయి. తన చేతులనుండి రక్తం బిందువులుగా కిందకు జారిపోతోంది, క్రింద పడివున్న హారి ముఖం అంతా రక్తంతో బీభత్సంగా వుంది.

తను హారిని హత్యచేశాడు.. తను హారిని చంపేశాడు. తను హంతకుడైపోయాడు .. తలుపు వేసుకొని బట్టలు కొట్టుకుందామనుకున్నాడు.. ఆ మేడమీదనుండి దూకి గప్చుపోదామనుకున్నాడు. తనను ఎవరైనా చిత్రవధచేస్తే బాగుండునిపించింది. తను హత్యచేశాడు...నిష్కారణంగా తను హత్యచేశాడు.

తనను పోలీసులు పట్టుకుంటారు. దూరంగా పోలీసుల ఈల వినిపించింది. తనకు ఏమి చెయ్యడానికీ తోచటంలేదు. తను సాగుతాడు. మేడమెట్లు దిగిన గుర్తు తనకు లేదు. తనుకెవరో వెంటాడినట్లు పరిగెత్తుతున్నాడు.

వేగానికి తను భయపడుతున్నాడు. తనకు వెనకగా ఒక కేక వస్తోంది. అందులో తనను పట్టుకోవడానికి పోలీసులు వస్తున్నారు. తన ప్రమేయం లేకుండానే తను పరుగెత్తుకుపోతున్నాడు ఎంతసేపటికీ కాళ్ళ నిన్న చెందలేకపోతోంది. తను తన ఇల్లు చేరాడు తన గదిలోకి వచ్చి కూర్చున్నాడు. తన చేతులనుండి రక్తం ఇంకా కారుతూనే వుంది. తను గుడ్డతో తుడుచుకున్నాడు. అయినా రక్తం కారుతూనే వుంది.

తను రొప్పుతున్నాడు. తనకు శ్వాస పీల్చడమే కష్టమయిపోయింది. తను యమయాతన పడుతున్నాడు. తను హారిని ఎందుకు హత్యచేశాడో అర్థంకాలేదు తను తన చేతులారా తన మిత్రుణ్ణి చంపుకున్నాడు. తను ఇక బ్రతికినా బ్రతుకకపోయినా ఒకటే. అతను లేకపోతే తను జీవించలేడు. తను చచ్చిపోవాలి.. తను పోయినా హారి తిరిగిరాడు.. తను నీచుడు...తను ఏ కారణమూ లేకుండా ఒక మిత్రుణ్ణి చంపాడు... తనను.. పోలీసులు ఒదలరు...తనను పోలీసులు ఉరితీస్తారు!...'

—మదనుడి మనసు యమయాతన అనుభవించి ది అతను గిజగిజలాడిపోయాడు. అతను నిద్రనుండి లేచాడు...అంతా చీకటి!...

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# గళ్లనుడికట్టు-1



**అడ్డము**

(2) దీనికి అంతులేదనిపిస్తుంది!

(4) నాలుగుకాళ్ల జంతువు చేసే శబ్దం ;

(7) ఆరేడు సంఖ్యలలో ఒక పరిపాలకుడు.

(8) అరవవాళ్ల అర్థ.

(9) కరివేపాకుచెట్టులోది చిన్న జంతువు మాత్రం కాదు;

(10) శ్రీరామునిలో ఋషికూడా ఉన్నాడు.

(12) ఎప్పుడు అద్దంలో ఎటు చూసినా కనిపిస్తుందేమో!

(14) మొట్ట మొదట.

(15) 18 నిలువులో ఉన్న ఒక ప్రసిద్ధపౌరాణిక వ్యక్తి.

(19) నిద్రలో ఉన్న!

(20) తలకిందులయిన సమయం ఇది.

(21) ఆఫ్రికాలో కూడా సంస్కృతం పేరుకల దేశం ఉన్నదంటావా?

(22) అర్జునుడిని కోర్టులో తలక్రిందులుగా మంచో పెట్టండి చూద్దాం!

(23) ద్రాక్షపాకంకన్నా కొంచెం కష్టమైనదంటారు.

**నిలువు**

(1) ఈస్వృగాన్ని ధరించినట్లు పేరు పెట్టుకున్న తన్ని నూతిలో పడేశారు.

(3) కేకు.

(4) చాలా తక్కువసేపును సంబంధించినది.

(5) వేడుకోకపోతే తమాషా ఉంది.

(11) వాని మూతుపును చెల్లించేటప్పుడు జాగ్రత్తగా చూడండి, పొడుగు తెలుస్తుంది:

(13) ఆడది ఒక పెద్ద కథ.

(14) వర్ష ఋతువులో ఇది కొటూరి పింగళి కవులు వ్రాసిన కావ్యం!

(15) రెండుసార్లు మూరి స్త్రీ?

(17) వినుకలు దంతాలతో చేసేపని— (మీరనుకునేది మాత్రం కాదేమో!)

(18) పాపము,

---

తను అప్పుడే నిద్ర లేచిన విషయం తనకు తెలియదు...తనకై పోలీసులు వస్తారు... తను హత్యచేశాడు ... అందులోనూ తన ప్రాణమిత్రుణ్ణి.

మదనుడికి అడుగుల చప్పుడు వినిపించింది అతను పారిపోబోయాడు...లేచి పరుగెత్తాడు...అంతా అంధకారం!... అంతా చీకటి !!...తను పరుగెత్తాడు. తన మోకాళ్ల మీద ఎవరో పెద్ద కఱ్ఱపెట్టి కొట్టారు...ఆ బాధకి తను అరవలేదు...ఇంకెవరో కేక వేశారు...మారే అరిచాడు...తన మీద ఎవరో లైటు వేశారు. తన మోకాళ్లు విరిగి పోయాయి...తను కూలబడిపోతున్నాడు... ఎంతసేపటికీ తను భూమిమీద పడలేదు... దిగిపోతున్నాడు. అఘాతంలోకి దిగిపోతు న్నాడు... గిలగిలాడిపోయాడు ...క్రింద పడిపోయాడు....తన తల పగిలి ముక్కలై పోయింది...ఒంటినిండా వేలుగా ముళ్ళు గుచ్చుకుపోయాయి...తన ఒంటినిండా రక్తం కారుతోంది....తను మారిని చంపాడు... తనకు మంచిప్రాయశ్చిత్తంజరిగింది.. తన్ను తానే మరచిపోతున్నాడు. తన ఒళ్ళంతా ఏదో ఒకవిధమైన తీపు అనుభవిస్తోంది... తన్ను తాను మరచిపోతున్నాడు...తన్ను తాను మరచిపోయాడు.

*    *    *

మదనుడి శవం లోయలో రాతిమీద ముళ్ళకంప ప్రక్కగా పడి చితికిపోయింది. అప్పుడే ఇంటినుండివచ్చిన మారి మదనుడి గదిలోకి వచ్చి లైటు వేశాడు. అప్పటికే మదనుడు పిట్టగోడ దగ్గరకు పరిగెత్తాడు అతని మోకాళ్లు గోడను కొట్టుకున్నాయి అతను ముందుకు తూలి లోయలోకి విరుచుకు పడ్డాడు. మారి కొయ్యబొమ్మలా నిశ్చేష్టుడయ్యాడు ★

---

# జీవనగంగ

(37-వ పేజీ తరువాయి)

కెందుకో ఆలస్యం అయింది. బహుశా ఏదన్నా మీటింగు పెట్టారేమో"

"ఒక్కడూ వస్తాడేమిటి?"

"లేదు కూడా మల్లిబాబు వుంటాడు. అతను కాలేజీనించి వచ్చేటప్పుడు వెంట బెట్టుకుని తీసుకువస్తాడు."

"అతనెవరు?"

"ఒక మంచి కుర్రవాడు. బి. ఎ. చదువు కుంటున్నాడు. ప్రతి ఉదయం ఈ అరుగు మీద ట్యూషను చెప్పుకుని డబ్బు సంపాదించుకుని చదువుకుంటూంటాడు"

"మన వాడేనా?"

"అంటే?"

"కులం, గోత్రం"

"అది నాకు తెలియదు"

"అదేమిటి నాయనా అలాగంటావు, ఎవరో తెలుసుకోకుండా ఇంట్లో పెట్టుకొంటావా? కొంపతీసి అలగా జాతివాళ్ళు కాదుగదా?"

ఈ కర్కశమైనధోరణికి ఉద్రేకపడినమన స్సునిఅణుచుకుని అతను ఎవరైతేనాకు దేనికి? కుర్రవాడు చాలా మంచివాడు. కష్టపడి సంపాదించుకుని చదువుకొంటున్నాడు. సెమ్మదైన స్వభావం. ఇక పోతే మాంసాహారో, శాఖాహారో అంటావా? అతను హోటల్లో భోజనం చేస్తున్నాడు. అది బ్రాహ్మణహోటలు అని మటుకు నాకు తెలుసు. దాన్నిబట్టి శాఖాహారే అనుకుంటున్నాను. ఇలాంటి మంచి గుణాలు కలిగిన వ్యక్తి ఏ కులస్థుడైతే నేం? ఒకనాడు ఒక సంఘటన జరిగింది. అతని గురించి సదభిప్రాయం కలిగించిందా సంఘటన. ఆ తరువాత అతను చాలా రోజులకి ఒకనాడు మా ఇంటికి వచ్చాడు. సహాయం కావాలన్నాడు. అడగమన్నాను. పరిస్థితంతా చెప్పి "ఈ అరుగుమీద పిల్లలకి చదువు చెబుతాను ఆ వారకొంచోటు ఇప్పించండి. ఆ పాకలో పడుకోనియ్యండి." అన్నాడు అలాగే అన్నాను. ఆ తర్వాత అతను కాలేజీలో చేరాడు. పదిమందిని మంచి చేసుకున్నాడు. నెలకి ఎలాలేదన్నా బాగానే సంపాదించుకున్నాడు. "

(ఇంకావుంది)

## బహుమతి పొందిన కార్టూన్




## పొట్టి కథలు

ఒక మంత్రిగారు పిచ్చాసుపత్రి చూడబోయారు. అధికారులూ పురప్రముఖులూ ఆయనను స్వాగతమిచ్చి అంతా చూపించారు. అక్కడి స్థితిగతులూ సాధక బాధకాలూ వివరించిన ఒక ప్రముఖుడితో మంత్రిగారు చాలాసేపు చర్చించారు.

"చూడగా చూడగా ఇదే గొప్పదనిపిస్తుంది. ఇక్కడివాళ్లదంతా అతిమానుషమైన మేధ. మీకు పుట్టి మాలోకంలా కనిపించినా మీ లోకంకన్న మా లోకమే మెరుగు" అన్నారాయన.

మంత్రిగారు తెల్లబోయి, 'మా లోకం అంటున్నారు మీరిక్కడే ఉంటారా ఏమిటి" అన్నారు.

"చిత్తం" అన్నాడా పెద్దమనిషి వినయంగా.

ఆశ్చర్యం పట్టలేక, "ఇంత సేపూ ఇంత చక్కగా మాట్లాడారే. మీరు ఇందులో ఎందుకున్నారో నాకు బోధపడదు" అన్నారు మంత్రిగారు.

"చిత్తం. మీరంతా అవతలున్నారుగదా అందుకు." అంటూ ఆ పెద్దమనిషి లేచి వెళ్లిపోయాడు.

* * *

చూడవచ్చిన పెద్దమనిషికి, వార్డెన్ దగ్గర ఉండి పిచ్చాసుపత్రి చూపిస్తున్నాడు.

"అతనెవరండీ అలా దిగులుగా ఉన్నాడు?"

"అతనా? అతను పాపం భగ్నప్రేమికుడు. వలచినవనిత వంచనచేసి డబ్బు గలవాడిని పెళ్లాడింది. పిచ్చివాడు కాబట్టి పిచ్చెత్తించుకున్నాడు" అన్నాడు వార్డెన్ వెటకారంగా.

ఆ పక్క గదిలోనే మరో ఆసామి గందరగోళంగా తిరుగుతున్నాడు.

"ఇతనే ఆవిడను పెళ్లాడిన ఆసామి" అన్నాడు వార్డెన్ అతనికేసి జాలిగా చూసి.

* * *

ఇద్దరు పిచ్చివాళ్ళు ఒక సెర్చిలైటును చూశారు. కాంతి కిరణం ఆకాశంలో చూపు కందనంత దూరం పోతోంది.

"ఈ కిరణం ఎక్కి ఆపై చివార కెళ్ళగలవా? పందెం వేస్తాను" అన్నాడు ఒకడు.

"ఓ, అదెంతపని. ఎక్కగలను గాని తీరా పైకెళ్ళాక నువ్వు స్విచ్చినొక్కి లైటార్పేస్తే? అక్కణ్ణించి కిందపడి చచ్చిపోనూ?" అన్నాడు సహచరుడు.

* * *

ఒక పిచ్చివాడు కోడిగుడ్డును తనమిత్రుడి బోడిగుండు మీద నిలువుగా నిలపడానికి శ్రద్ధగా కృషి చేస్తున్నాడు.

ఒకగంట అయ్యాక బట్టతల తాలూకు అతను విసుక్కున్నాడు.

"నీకేవన్నా పిచ్చా వెర్రా. అంత నున్నటి కోడి గుడ్డు కింద బట్టతల ఎలా నిలబడుతుందనుకున్నావు?" అని.


Printed and Published for NageswaraRao Estates (Private) Ltd,. by S. Radha Krishna at The Andhra Patrika Press 6 & 7. Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



విశ్రాంతిమందిరము: తుంగభద్రా డాము

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.

Johnson's
BABY
POWDER
Johnson & Johnson

# తల్లి పెంపకమువలె సౌమ్యమైనవి...
# డెబ్బది ఏళ్ల అనుభవముతో చేయబడే
# జాన్సన్స్ తయారులు!

చిన్న పిల్లల విషయములో సాటిలేని అనుభవము వలన పిల్లల చర్మ రక్షణకైన ప్రతి వస్తువును జాన్సన్స్ వారు మాత్రమే తయారుచేస్తున్నారు!

సౌమ్యమైన మరియు తెల్లని జాన్సన్స్ బేబీ సోప్ ...ప్రపంచములోకెల్ల అత్యంత శ్రేష్ఠమైన టాల్కు నుండి తయారుచేయబడే మృదువైన మరియు ఉపశమనము చేకూర్చే జాన్సన్స్ బేబీ పౌడర్...చంటి పిల్లల లేత చర్మముల అతి జాగ్రత్తయైన సంరక్షణ పూర్తి అగుటకు జాన్సన్స్ బేబీ క్రీమ్ మరియు బేబీ ఆయిల్!




**జాన్సన్ అండ్ జాన్సన్ ఆఫ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్**

JWT-JJ 348